సంవత్సర చందా
రు. 13-0-0
విడిపత్రిక 25 న.పై.

# ఆంధ్రపత్రిక

సచిత్ర వారపత్రిక

సంపుటము 52
సంచిక 11
6-11-57

Founder : K. NAGESWARA RAO

హేవిళంబి కార్తీకం, శుద్ధ చతుర్దశి, బుధవారం

 విషయానుక్రమణిక 

ముఖచిత్రం :

"ఎమ్. ఎల్. ఏ. లో నటించిన
గిరిజ

★


| | | |
|---|---|---|
| న్యూఢిల్లీ లేఖ | — | 4 |
| విక్రమార్కుడిమార్కు సింహాసనం | — | 6 |
| నక్షత్ర ఫలితాలు | — | 8 |
| నటనమే బ్రతుకోయి | — | 11 |
| ఊర్మిళనిద్ర | — | 13 |
| వాన వెలిసింది | — | 16 |
| అక్కన్నమాదన్నలమహేశ్వరం | — | 20 |
| దివినుండి భువికి | — | 22 |
| మాధవమ్మ కోలు | — | 26 |
| ఆంధ్రప్రదేశ్ ప్రధాన న్యాయస్థానం | — | 28 |
| వనితాలోకం | — | 35 |
| వంటలు | — | 38 |
| గృహవైద్యం | — | 39 |
| వనితావాణి | — | 40 |
| మూర్ఖులతో సంభాషణ | — | 43 |
| గణపతి భట్టు | — | 44 |
| సినిమా | — | 50 |

# నేనాంధ్రుణ్ణి

[నవంబరు 1; ఇది ఆంధ్రప్రదేశ్ అవతరణ ప్రథమ వార్షికోత్సవ శుభసమయం. ఆంధ్రులు తమ పూర్వ ప్రతిభను స్మరించి ఆత్మస్తుతి చేసుకునేముందు, తమలో వున్న ప్రస్తుతలోపాలనుకూడా గమనించి ఒకసారి ఆత్మ పరిశీలన చేసుకోవాలని ఈ చిన్న వ్యంగవ్యాస అంతరార్థం—సం]

నాలో నున్న ఆంధ్రత్వము మీకు ఎవ్వరికీ తెలీదేమో! తెలుసుకోండి... నాలో గొప్ప గుణాలున్నాయి...... తెలివితేటలున్నాయి...కళల్లో అయితేనేం, విజ్ఞానంలో అయితేనేం...విమర్శలో అయితేనేం... వేదాంతంలో అయితే నేం... నాకు ప్రతిభఉంది... కాని ఇతరులెవరైనా ఉందీ అంటే నేను ఒప్పుకోను. లేదు అని వాదించే వాళ్లల్లో నేనొకణ్ణి! నాకు పొరుగింటి పుల్లకూర రుచి! మా అమ్మ ఇంట్లో వండిన పంచభక్ష్య పరమాన్నాలు కూడా నాకు నయించవు! పైగా ఏవగింపు. అయినా, నేను ఆంధ్రుణ్ణి!

వంటల్లో తెలుగువారి వంటలు నాకు నచ్చవు. అరవవారి 'సాంబారు', మరాఠీ వాళ్ల 'కఢీ' (అది మన మజ్జిగపులుసే లెండి) బెంగాలీవాళ్ల 'సాందేశ్', హిందుస్తానీవాళ్ల 'గులాబ్ జామ్' నాకు పరమయిష్టం! నేను ఆంధ్రుణ్ణికదూ! అందుచేత నాకు ఆంధ్రులంటే పరమ అసహ్యం. నాస్నేహితులు బెంగాలీలు ...గుజరాతీలు ... హిందుస్తానీ వాళ్లు, మరాఠీలు...ఎవ్వరయినా సరే— తెలుగువాళ్లు కాకుండా ఉంటే చాలు— అతివేగంగా నా స్నేహితులవుతారు.

నేనెప్పుడూ ఆంధ్రీకరించబడిన బెంగాలీ నవలలే చదువుతాను. ఎందుకంటే, బెంగాలులో రవీంద్రనాథ టాగూరు జన్మించాడు కనక!

అంతకన్న ఎన్నిరెట్లో ప్రతిభావంతులైన కవులు తెలుగునాడులో ఉన్నా వారి వ్రాతలు నా తలకెక్కవు! అయినా, నేను ఆంధ్రుణ్ణి!

నేను బెంగాలు వెళితే బెంగాలీవాణ్ణి అవుతాను...మహారాష్ట్ర దేశంలో ఉంటే మరాఠీవాణ్ణి అవుతాను. పాకిస్తాన్ లో ఉంటే ఇటే తురకనుకూడా అవుతాను! వేషభాషల్లోనే కాదు! అక్కడివాళ్లలో అంతరంగిక స్నేహంచేస్తాను. వాళ్ల అమ్మాయిలను పెళ్లాడతాను. నా భాష మరిచిపోతాను. నాలోవున్న ఆంధ్రత్వం చంపుకుంటాను. సంఘ సంస్కర్తనని విర్రవీగుతాను; అయినా, నేను ఆంధ్రుణ్ణి!

మా యింట్లో రేడియోలో ఎప్పుడూ 'సిలన్' సంగీతం తప్ప మరొక తెలుగు స్టేషను స్విచ్చి చెయ్యము. ఎందుకంటే తెలుగు పాటలంటే నాకు తలనొప్పి! అయినా, నేను ఆంధ్రుణ్ణి!



ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ చిహ్నం
"పూర్ణ కుంభం"

మా ఇంట్లో పిల్లలందరికీ హిందీ చెప్పిస్తాను. తెలుగు మరిచిపొమ్మంటాను. అమ్మని హిందీలో 'మా' అని పిలవమని పిల్లలకి నేర్పుతాను. హిందీ పత్రికలు తెప్పిస్తాను. ఇంట్లో అందరిచేతా హిందీ మాట్లాడిస్తాను. తెలుగు మాటాడనివ్వను. అయినా. నేను ఆంధ్రుణ్ణి!

మా ఆవిడకున్న చీరలు బాగా నచ్చినవి దక్షిణాదిచీరలు, మరాఠీచీరలు, లేక 'బనారసు' చీరలు! తెలుగునాడులో నేసిన చీరలు ఆమె కళ్ళకు నదరుగా ఉండవు. ఎందుచేతనంటే, ఆమె, ఆంధ్రుణ్ని అయిన నాభార్య కనక!

బెంగాలీకళ అంటే నాకు అపరిమిత ప్రీతి. బెంగాలీ సాహిత్యం అంటే ఆదరణ. బెంగాలీవాళ్ళు చేపలు తినడంవల్ల మేధావంతులైనారు కనక ప్రతి ఆంధ్రుడూ బాగుపడాలంటే అదేపని చెయ్యాలని వాదించే వాళ్ళల్లో ప్రప్రథముడను నేను!

పుడితే బెంగాల్లోనే పుట్టాలి అని ఆంధ్రదేశంలో పుట్టిన అసలు ఆంధ్రులు కొందరు విచారిస్తూ తాము బెంగాలులో పుటనందుకు పశ్చాత్తాపపడుతుంటారు! అట్టి వెర్రివెంగళప్పలకి నేను లీడర్ని!

తనలోవున్న గొప్పతనం తెలుసుకోలేనందుకు నన్ను ఆంజనేయుడని కొందరంటారేమో! అలా అంటే ఒక్క నవ్వుగంతువేసి పళ్ళు ఇకిలిస్తాను!

తెలుగువాళ్ళ పూజలు, నమ్మకాలు నాకు సుతరామూ కిట్టవు. వాళ్ళ మతం నాకు అర్థంకాదు. మతం స్వీకరించాలంటే ఏ కుసుమ హరనాథ్ మతమో, లేక రాధాస్వామి మతమో స్వీకరించాలి! అప్పుడే నేను నిసలైన ఆంధ్రుణ్ని అనిపించుకుంటాను!

నా పిల్లలకి 'గాంధి', 'తిలక్', 'గోఖలే' అని నామకరణం చేస్తాను (అవి ఇంటిపేర్లు అని తెలియకుండా!) ఆవిధంగా నా 'హీరో వర్షిప్' కి నాలో నేను సంతృప్తి పడతాను, ఆ పేర్లు పెట్టడంలో ఉద్దేశమేమంటే తెలుగుదేశం పేర్లకు గొడ్డుపోయింది కనక!

పై గుణగణాలు చదివి నవ్వాలో ఏడవాలో తెలియని ఆంధ్రులను ఏడవమని సలహా ఇస్తాను.

అయినా నేను ఆంధ్రుణ్ణి! ★

—బి. వి. నరసింహం.]




# "బాధ్యత ఎరిగి ప్రవర్తించాలి"

ప్రధానమంత్రి పత్రికా విలేఖరులతో [illegible]వల [illegible]న గోష్ఠినిగూర్చి కొంత సంచలనం బయలుదేరింది. ఆ గోష్ఠిలో పత్రికలకు సంబంధించిన కొన్ని ముఖ్య విషయాల ప్రసక్తి రావడంమూలంగా, ఈ సంచలనం ఇంకా తగ్గనేలేదు.

అసలు పత్రికావిలేఖరుల సమావేశం అంటే ఏమిటో ఈ సందర్భంలో నిర్వచించుకోవడం మంచిది. పత్రికావిలేఖరుల సమావేశంలో ఒక వ్యక్తిని విలేఖరులు కలుసుకోవడం, ఆ వ్యక్తి తన అభిప్రాయాలు వెల్లడించడం, విలేఖరులు ఆ వ్యక్తినుంచి సమాచారం సేకరించడమో, లేక ఆయన అభిప్రాయాలను విశదీకరించమని కోరడమో జరుగుతూ ఉంటుంది. (విలేఖరుల సమావేశాలు జరపడం అమెరికాలో బయలుదేరిన ఆచారం.) అంతేగాని సమావేశం జరిపే వ్యక్తితో పత్రికావిలేఖరి తన సొంత చాదస్తాలన్నీ చర్చించేందుకేర్పడిన సభకాదు అది; పత్రికావిలేఖరుల సొంత కష్టాలన్నీ వెళ్ళబుచ్చుకునేందుకేర్పడిన సభ అంతకన్నా కాదు. అలా సొంతగొడవ లేకరువు పెట్టడానికి పత్రికా విలేఖరులు ఆ సమావేశాన్ని ఉపయోగించుకుంటే, తమ వృత్తిని వారు దుర్వినియోగపరచినట్లవుతుంది. న్యూఢిల్లీలో ఈ మధ్య సరిగ్గా ఇదే జరుగుతోంది. ఉదాహరణకి మొన్న ప్రధానమంత్రి జరిపిన పత్రికావిలేఖరుల సమావేశానికి హాజరైన విలేఖరులు పత్రికారచయితల వేతన నిర్ణాయక సంఘ నిర్ణయాలను అమలుజరపడం గూర్చి ప్రస్తావించారు.

ముందు కార్మిక న్యాయస్థానాల తీర్పులనుగూర్చి చర్చిద్దాము. కార్మిక తగాదాలను పరిష్కరించడానికి ఇప్పుడున్న ఏర్పాట్లకంటె సబబైన ఏర్పాట్లు చేయడం అత్యవసరంగా కనిపిస్తోంది. కార్మిక న్యాయస్థానాలు తమ తీర్పులవలన దేశ ఆర్థికవ్యవస్థకు, ఏ పరిశ్రమనుగూర్చి తీర్పు ఇచ్చారో ఆ పరిశ్రమకు ఏ విధమైన దెబ్బ తగులుందో గుర్తించి మరీ తీర్పులు ఇచ్చే ఏర్పాట్లు చెయ్యాలి. అదీగాక ఒకమనిషికి జీతం పెంచినప్పుడు ఆ మనిషి చేసే పనీ, ఆ మనిషి జీవనస్థాయీ కూడా పెరుగుతున్నాయో లేదో ఎప్పటికప్పుడు విలువకడుతూ ఉండాలి. ఉదాహరణకి, న్యూఢిల్లీలో కొందరు సూపరింటెండెంట్లు భారత ప్రభుత్వంలో సంయుక్త కార్యదర్శుల పదవులకు ప్రమోట్ అయినవారున్నారు. కాని పదవి పెరిగినా వారి జీవనస్థాయిమాత్రం పెరగలేదు. సూపరింటెండెంట్లుగా ఉన్నప్పుడు ఏయిళ్ళలో ఉండేవారో ఇప్పుడూ ఆ యిళ్ళల్లోనే ఉంటున్నారు. అంటే జీతం బాగా పెంచడంవల్ల మామూలుగా పెరగవలసిన జీవనస్థాయి పెరగడం మానేసిందన్నమాట.

## శ్రీ కృష్ణ

[ఆంధ్రపత్రిక ప్రతినిధి]

ఇక వేతననిర్ణాయక సంఘ నిర్ణయాల విషయానికి వద్దాము. ఈ నిర్ణయాలను అమలు చేయడం పత్రిక ఆర్థికపరిస్థితిమీద ఆధారపడి ఉంటుంది. రైల్వేరేట్ల విషయంలో ప్రజలు భరించగలరా లేదా అని ఆలోచించినట్టే, పత్రికల విషయంలో కూడా పత్రికలు భరించగలవా లేదా అని ఆలోచించాలి.

వేతన నిర్ణయాలను అమలుచేయించేముందు ఆ నిర్ణయాలవలన ఏర్పడే ఆర్థిక ఫలితాలను, ముఖ్యంగా ఎన్ని పత్రికలు మూతపడతాయో, ఎందరు పత్రికా రచయితలు నిరుద్యోగులవుతారో గమనించి మరీ అమలు విషయం ఆలోచించవలసి ఉంటుంది. న్యూఢిల్లీకి సంబంధించినంతవరకూ ప్రభుత్వం మరో పని చేస్తే బాగుంటుంది. వేతన నిర్ణయాలను అమలు చేయించడానికిముందు, న్యూఢిల్లీలో ఉన్న విలేఖరులు తమ తమ పత్రికలవద్దనుంచి నెలకు రూ. 500/- తక్కువకాకుండా జీతం తీసుకుంటున్నారని రూఢి అయితేనే తప్ప ఆ విలేఖరులను భారతప్రభుత్వం గుర్తించదని స్పష్టంచెయ్యాలి. దీని కనుగుణంగా ప్రభుత్వ పరగణనకు సంబంధించిన నిబంధనలను మార్పుచేస్తే పత్రికారచయితలు బాధపడకుండా ఉంటారా అని ప్రభుత్వం ట్రేడ్ యూనియనిస్టులను అడిగిచూడాలి. ఇలా చేస్తే పత్రికలు తమ న్యూఢిల్లీ విలేఖరులకు నెలకు రూ. 500/- ఇచ్చుకోనన్నా ఇచ్చుకోవాలి. లేక భారతరాజధానిలో ప్రతినిధులను నియమించుకునే ఘనతకు నీళ్ళన్నా వదులుకోవాలి. కాని ఇలాంటి మార్పుకు ట్రేడ్ యూనియనిస్టులే అంగీకరించరని ఇక్కడ కొందరు భావిస్తున్నారు. ఎందుకంటే తమ పత్రికలు అంత జీతం ఇచ్చేకంటే, అసలు న్యూఢిల్లీలో విలేఖరులు లేకపోయినా ఫరవాలేదని భావిస్తాయని వారికి తెలుసు.

ఒకానొక వార్తాసంస్థ తమకు పత్రికలూ, ప్రభుత్వాలూ ఇచ్చే ప్రతిఫలం ఎక్కువ చేస్తేనే తప్ప, లేకపోతే మూసేస్తామని బెదిరించడం అందరికీ తెలిసినదే. ఇది మరీ వింతగా ఉంది. బ్రిటిషు దొరతనం రోజుల్లో ప్రభుత్వమిచ్చే ప్రతిఫలాన్ని 'సబ్సిడీ'గా పరిగణించేవారు. అసలు ఇప్పటికే ప్రభుత్వం ఇచ్చే ప్రకటనలు నానాటికీ ఎక్కువ అవడం మూలంగా పత్రికల స్వాతంత్ర్యము కొంత దెబ్బ తింటోంది. ఇక వార్తాసంస్థలకు కూడా 'సబ్సిడీ' ఎక్కువ చేస్తే ఏమవుతుందో తేలికగా ఊహించుకోవచ్చును.

అయితే ట్రేడ్ యూనియనిస్టు లొకమాట అనవచ్చును. ప్రభుత్వం సబ్సిడీ ఇస్తున్నప్పటికీ ఒక వార్తాసంస్థ ప్రతినిధి ఈ మధ్య ఒక రాష్ట్ర మంత్రిని నిందించాడనీ, రాజకీయ అవకాశవాదులైన కొందరు పారిశ్రామికులు అప్పుడప్పుడు విరాళాలు పారేస్తున్నప్పటికీ కొన్ని వార్తాపత్రికలలోని పత్రికా రచయితలు ప్రైవేటు రంగాన్ని రద్దుచేయాలని వాదిస్తూ తమ స్వాతంత్ర్యాన్ని నిలబెట్టుకున్నారనీ ట్రేడ్ యూనియనిస్టులు ఉదహరించవచ్చును. ఇది నిజం కావచ్చును. కాని శ్రీ నెహ్రూ రాజకీయాల నుంచి తప్పుకున్న తరవాత కూడా ఇలాంటివి జరగడానికి అవకాశం వుంటుందా? పత్రికా రచయితలకు సంబంధించినంతవరకూ, పారిశ్రామికులు నిర్నిబంధంగానే విరాళాలిస్తూ

ఉండిఉండవచ్చును. కానివీటో ప్రయోజనం నెరవేరుతుందంటేనే తప్ప ఎవరూ ఊరికే విరాళాలివ్వరు. విజ్ఞానాభివృద్ధికి పనికివస్తుందని విరాళాలివ్వరు. ఫలానా పారిశ్రామిక దేశభక్తుడికి హఠాత్తుగా పత్రికా రచయితల మీద ప్రేమ పుట్టుకొచ్చి విరాళా లివ్వడు. అధికారంలో ఉన్న ఏ మహానుభావుడి ప్రాపకమో సంపాదించడానికీ, ఒక నూరు ఇచ్చి ఐదునూర్లు లాభము తీయడానికీ మాత్రమే విరాళా లివ్వడం జరుగుతుంది. జాతీయ దృష్టితో చూస్తే, ప్రకటనలకంటే ఈవిరాళాలు, సబ్సిడీలు మరీ దారుణమైనవి. ఎందుకంటే విరాళాలవల్ల ఏ ధనవంతుడికో ప్రభుత్వంలో పలుకుబడి పెరగడం, సబ్సిడీల వల్లసబ్సిడీపుచ్చుకునేసంస్థ నైతికంగా పతనం కావడం జరుగుతుంది. వేతన నిర్ణయాలను అమలు చేయించడానికిగాను విరాళాలను, సబ్సిడీలను ఎక్కువ చేయాలనే వాదనను స్వతంత్రభారతశ్రేయస్సుదృష్ట్యా, పత్రికా రచనస్థాయిదృష్ట్యా ఖండించాలి.

శ్రీ నెహ్రూ జన్మతహా సజ్జనుడేకాక, గొప్ప ప్రజాస్వామ్యవాది. ఆయన సమక్షంలో ఒక రాష్ట్రమంత్రిమీద ఆరోపణలు జరిగినప్పుడు ఆయన ఇచ్చిన సమాధానం ఏమిటంటే "ఈ సంగతి నేనూ విన్నా"నని. శ్రీ నెహ్రూ రాజకీయాలనుంచి తప్పుకున్న తరవాత ఇలా ఎవరన్నా విలేఖరి రాష్ట్రమంత్రిమీద ఆరోపణచేసి ఉంటే, ఆ విలేఖరి పనిచేసే వార్తాసంస్థకు ప్రభుత్వపు సబ్సిడీ వెంటనే రద్దయి ఉండేది. అందుచేత వార్తాసంస్థల ప్రతినిధులు కొంచెం మంచి చెడ్డా తెలిసి ప్రవర్తించడం నేర్చుకోవాలి. వార్తాసంస్థల ప్రతినిధులు వార్తలను యథాతథంగా సరఫరాచెయ్యాలిగాని 'సొంత పైత్యం' జోడించగూడదు. బొంబాయి రాష్ట్ర కార్మికమంత్రిని నేనేమీ ప్రత్యేకంగా సమర్థించడం లేదుగాని, యజమానికి ట్రస్టీకి తేడా ఉందనుకుంటాను. శ్రీ నెహ్రూ భారత ప్రజలు ఎన్నుకున్న ట్రస్టీ. అంతేగాని ఆయన భారతదేశానికి యజమాని కాదు. భారతదేశం ఆయన సొంతఆస్తి కాదు.

ఏది ఏమైనా, పత్రికా విలేఖరులగోష్ఠిని పత్రికా రచయితల సొంత గొడవలు వెళ్ళబుచ్చుకునే వేదికగా మార్చుకోతగదనే నేను నేది. పత్రికా రచయితలను కూడా ఇప్పుడు కార్మికులకిందే జమకట్టారు గనుక, ప్రధానమంత్రి దగ్గిరికిగాని, ఇతర ఉన్నతాధికారుల దగ్గిరికిగాని వెళ్లినప్పుడు ఇతర పరిశ్రమలలోని కార్మికులవలెనే మెలగాలిగాని ప్రత్యేక హోదాలో వ్యవహరించాలనుకోవడం అనుచితం.

ప్రధానమంత్రిని అడిగినప్రశ్నలు [illegible]

(54-వ పేజీ చూడండి)






# విక్రమార్కుడి మార్కు సింహాసనం

చలచిత్ర కథలు

ఎస్. పార్థసారథి

తొమ్మిదింటికి తెల్లవారింది. రాజు లేచి చేతిలో 'శ్రీ రాజ్' చుట్టుకుని కళ్ళద్దుకున్నాడు. వంటింట్లో నరసు కనబడింది. చాలా అందంగా ఉంది. నీలిరంగు చీరకట్టుకుంది. దానికోచాయ తక్కువచేసి అదే రంగు రవిక తొడుక్కుంది. చీరమీద, జరీపోగులు సినిమా పాటలలో భావంలా, అస్తినాస్తి సందేహం కలిగిస్తూ మెరుస్తున్నాయి.

అప్రయత్నంగా తన అవతారాన్ని చూచుకున్నాడు రాజు. ప్రేమఘట్టంలో డ్యూయెట్ లాగ, దాని తరువాతి డైలాగులాగ మాసి మటిగోటిన తన లాగూ చొక్కా చూస్తే తనకే చిరాకేసింది.

నరసు చూడకుండా అమాంతం మాయమై పోదామని ముచ్చటపడ్డాడుగాని కుదిరింది కాదు. ఈలోగా నరసు చూడనే చూసింది. చూసి ప్రేమతో నవ్వింది. 'ముగంకడుక్కు స్నానంచేసిరా. కాఫీ తాగుదుగాని' అంది.

రాజు సిగ్గుపడి ముడుచుకుపోయాడు. స్నానం గీనం కానిచ్చి, తలా గిలా దువ్వుకున్నా, మాసినగడ్డం, బట్టలు మూలాన రోజూలా రాజు ప్రకాశించలేకపోయాడు.

కాఫీ తాగగానే సిగరెటుపెట్టె పట్టుకొచ్చి ఇచ్చింది నరసు.

ఈ అభిమానం, ఆదరణ, మర్యాద చూడగా రాజుకి మతిపోయింది. అణువణువూ కృతజ్ఞతతో నిండిపోయింది. ఏం చేస్తే తన కృతజ్ఞత తెలుస్తుందో బోధపడలేదు. నుదురుమీద ముంగురులు తిరుగుతున్నా బాగుండును; వాటిని సవరించి కొంత ఋణం తీర్చుకోవచ్చు. తిలకంకాస్త వంకరగా ఉన్నా బాగుండును. దిద్ది కొంత ఋణం తీర్చుకోవచ్చును. లిప్‌స్టిక్ చెరిగినా, పౌడరు ఓచోట పేరుకున్నట్టున్నా బాగుండును. సర్దవచ్చును. పాదాలు బోసిగా ఉన్నట్టనిపించినా బాగుండు; పారాణి తీర్చి అలంకరించవచ్చు. పట్టాలున్న మూలాన వాటికా అవకాశం లేకపోయింది.

అయితే ఇలా దారుణంగా ఇంత కృతజ్ఞతా అజ్ఞాతంగా ఉండిపోయి వృథా కావలసిందేనా? దేవుడు లేడా? ఉంటే ఈ స్థితిని గమనించడా?

ఉన్నాడు. అందుకనే నరసుసిగ ముడిలో తురుముకున్న మూడుపూలలో నడి మధ్య నున్నది. పట్టు తప్పి, వాలి, రాలిపోయే ప్రమాదకర పరిస్థితిలోపడి, 'వాలి సోలితినోయి, సోలిరాలెదనోయి' అని సోలో పాడింది.

భయపడకుము అంటూ రాజు ఆ పుష్పానికి అభయమిచ్చి, ఆదుకుని, దాన్ని సిగలో సరిగా అమర్చాడు. 'అరె. ఈ పువ్వురాలిపోయేలా ఉంది' అని జనాంతికంగా ప్రకటించి

నరసు నవ్వింది.

తరించినట్లనిపించింది రాజు ప్రాణానికి. ఇంక టపాకట్టేసి పాయకులోకం వెళ్ళిపోయినా ఫరవాలేదనిపించింది. అయితే అప్పుడే లాంగు జర్నీ ఎందుకులే అని నవ్వుకున్నాడు.

"అలావెళ్ళొస్తా!" అన్నాడు లేచినిలబడి.

'యాడకెళ్లేది. ఈపూట నాకు షూటింగు లేదు, మద్దివాల నాతోస్టూడియోకొద్దుగాని' అంది నరసు.

"అదికాదు నిన్న పేపరాఫీసులో నా పెట్టె, సంచీ పెట్టొచ్చాను. అందులో గుడ్డలున్నాయి. తెచ్చుకుంటాను. ఇవి మరీ మాసిపోయాయి" అన్నాడు రాజు.

'సరే తొందరగా ఒచ్చెయ్' అందినరసు.

"వెళ్లొస్తాను సీతా." అన్నాడు రాజు వినయంగా.

"ఒహో హో. బలే వోడిలాగున్నావే. ఆగాగు!" అంది నరసు పక పక నవ్వుతూ.

లేచి, ఓ చిన్న కాగితం, పెన్సిలుముక్క తీసి రాజుకిచ్చింది.

'రాయి! నాపేర్రాయి అందులో నర్సు. యం. లక్షిన్నర్సు...యడ్రసు—" అంటూ చెప్పింది.

'అయామ్‌సారీ... సీత అనుకున్నా' అన్నాడు రాజు.

'నయ్యంగదా ముంగలేసెప్పావు ఈమాట ఆనక తిరిగొచ్చి సీత ఇల్లేడ అంటే, ఈడ ఎవరూ సెప్పేవోళ్లు గాదు. మల్లా ఇంకెడకోబోయి మెత్తగా తన్నులిందువు' అంది నరసు పకపకనవ్వి ఆచీటి రాజు జేబులో పెడుతూ.

కనుక్కొని, వెతుక్కొని పేపరాఫీసు కెళ్లాడు రాజు.

నలుగు రైదుగురు కూర్చుని కులాసాగా కబుర్లు చెప్పుకుంటున్నారు.

తనని నిన్న ఆదరించి నాయనెవరో గుర్తు తెలీక, తటపటాయిస్తూ ఆగది గుమ్మంలో నిలబడి పోయాడు రాజు.

"నాకివాళా రేపూకూడా షూటింగులేదు సుబ్బరంగా రెస్టుతీసుకో అమ్మా అన్నాడు పొడ్యూసరు." అంటున్నాడొకాయన కాళ్లు ముడుచుకు కూర్చుంటూ.

రాజు తుళ్లిపడి అటు చూశాడు. అమ్మా అన్నాడంటాడేమిటి, అమ్మాబొమ్మా'ను'అనుకుని. చూస్తేఆయన మొగాడే,మరిఆప్రొడ్యూసరెవడో విణ్ణిరెస్టుతీసుకో అమ్మా అని ఎందుకన్నాడు! చూస్తే పచ్చి మొగాడుగదా. బుగ్గ మీసాలూ గెరాజుట్టూ వాడూను. అయితే ఒకవేళ బాలనటుడేమోలే అని సర్ది చెప్పుకున్నాడు.

'నాగ్గూడా లేదుగా షూటింగు. ఎల్లుండే

# బిచ్చగత్తె

దానాలు జనట - ధర్మాలివ్వుమీ!
బిడ్డల్లు గలదాన - భూదేవి తల్లీ
పిడికెడూ బిచ్చాము వడవెయ్యి తల్లీ
కళ్లులేనీదాన్ని - కాళ్ళవిటిదాన్నీ!

* * *

వ్యవ్రాలనూగూసున్న - వో ముసలయ్యా
యేమిటయ్యా నీవు - అంటువున్నావూ?
పంటల్లుబాగాను - పండలేదంటావ!
బిచ్చాము వెయ్యనూ - బియ్యమేదంటావ?
అట్లయితే వొకమాట - వింటావ నువ్వూ?
దుక్కులూ బాగాను - దున్నావ తాతా?
యిత్తులూ సక్కనివి - వోశావ తాతా?
యెరువులూ మంచివి - యేశావ తాతా?
పెట్టావ నీళ్ళనూ - బాగుగానీవు?
పంటేల పండదూ - పనులిన్ని జేస్తే?
కూడేల దొరకదూ - కావు బాగుంటేను?

* * *

ప్రొయ్యికాడున్నట్టి - పెద్దదొరసానీ!
బిడ్డల్లు గలదాన - భూదేవితల్లీ!
యేమిటమ్మా నువ్వు - అంటువున్నావూ?
యింటిలో రోగాలు - వున్నయంటావా?
ముద్దుబిడ్డలు మంచ - మెక్కిరంటావా?
యేడదీ బిచ్చాము - యేడదంటావా?
యెట్టనే బిచ్చాము - పెట్టుటంటావా?
అమ్మరో వోయమ్మ - అతివలచ్చిమీ!
మమ్మగన్నాతల్లి - ముత్తయిదురాలా
మాటొక్కటున్నాది - మరివింటవమ్మా?
యెందుకు రోగాలు - వసయ్యొసూడూ
తిండి మంచిది మనము - తినబోమె తల్లీ!
మురికినీటినిచాల - మనము తాగుతున్నా [మూ!
వుండేది చీకంటి - యిళ్ళలోనమ్మా
అందుకే రోగాలు - వస్తాయె తల్లీ!
సర్కారు శెప్పేటి - సక్కన్ని యిళ్ళు
కట్టుకోవాలమ్మ - కష్టాలుపడి మనము.

* * *

మంచానగూసున్న - వో ముద్దులయ్యా
యేమిటయ్యా నువ్వు అంటువున్నావూ?
సర్కారు ఈపనులు - శెయ్యాలె అంటావ?
సక్కగా వున్నాది - శెప్పినట్టిమాట.
సర్కారు ఈపనులు - శెయ్యాలి నిజమూ
అయినగానీ సూడు - ఒక్కమాటున్నాది.
సక్కనయ్యా శెప్పు - సర్కారు యెవ్వారు?
వోటు లిచ్చినాము - వాళ్ళి పంపాము
వారు శెయ్యాగలది - వారు శేసున్నారు?
అటులానీ మనము - వూరుకోవచ్చా?
దేశమెవ్వరిదయ్యా - దొడ్డమారాజా?
మూలేది యెవరయ్యా - ముద్దులామారాజ?
దేశాము మనదయ్యా - తెలిసికోవయ్యా
మూలేది మనమయ్యా - మాటనిక్కువాము!
మనమూలు లెవనుమరి - మాపుజేస్తారయ్యా
యింటిలో దీపాము - యెవరు ఎలిగిస్తారు?
మనమూల్లలను మనమె - మాపుజెయ్యాలా
మనయింటిదీపాము - మనమె ఎలిగించాల
మనదేశపూపనులు - మనమె జెయ్యాలా
పైసలున్నావారు - పైసలియ్యాలా
భూములున్నావారు - బూములియ్యాలా
బలుగురూ కలవాల - నడవాలి ముందుకీ
సర్కారుకండగా - సక్కగా నిలవాల
మొచ్చమ్ము అప్పుడే - మనదేశమునకూ
కరువు కాటాకాలు - కాసంత లేకుండ
చల్లగా అందరము - సక్కగావుంటాము!



లక్ష్మీకాంతమోహన్

---

నా డాన్సుంది. లైటింగూ అదీ అయే సరికి అవతి లెలుండవుతుంది. దానికే భవుళా వెళ్లను. స్పెషల్ గా సిలుకులంగాకుటించమంటే కుదర్దు పొమ్మన్నాడు డాన్సు డైరెకరు నే సెందు కెళ్లాలేం" అన్నాడు ఇంకో ఆయన. ఆశాస్త్రీకీ బుగ్గమీసాలున్నాయి జహాంగీరులా.

రాజాకి గుండె గుభేలుమంది. ఏమిటీ మిష్టరీ? ఆడాళ్లంతా మొగవేషాల్లోవున్నారా ఇక్కడ షూటింగవుతోందా?...

"నన్నడిగితే మానెయ్యమంటాను. పట్టు పడితే వదలకూడదు. నేను మానెయ్యలే?... కిందట్నెల పిక్చరు మొదలెట్టినపుడు. సెకండు హీరోయినిమ్మని అడిగాను. లేకపోతే, ఒక డాన్సు ఉండేరోలన్నా కావాలన్నాను... అది కుదరదూ, కోయవాడి రెండో కూతురే వెయ్యమన్నాడు నన్ను...అక్కర్లేదుపొమ్మన్నాను" అన్నాడు తృతీయుడు.

'ఓయబ్బో నీకబుర్లకేంలేవోయ్. అది కుదరదన్నవాడివి మొన్న...లో చిన్నతి వేషం కావాలని అడగలేదు? బాకు పోటీగా' అన్నాది నాలుగో శాల్తి

రాజా బుర్ర పనిచెయ్యడం మానేసింది. ఉన్నా ఊడినా ఒకటేనన్న భావంతో పళ్లు ఊడిపడబోయాయి.

సన్నగా పళాకలా ఉన్న ఇంకో ఆయన హాండిల్ బార్ మీసం దువ్వుకుని, 'మేష్టార్లూ మీ సంక్రాంతికంగాని మొన్న సుబ్బన్నగారూ కేనా ఓలమ్మ...ఆశీర్వదించాం...కారంగా ఏమిపిల్ల అనుకున్నారు. మన డిస్కవరీ లెండి మనకి తెలిసిన పత్రికల్లో ఒకటి రెండు వారాల్లో బొమ్మ అదీ వేయిస్తున్నాం...అబ్బ రెండుకళ్ళు చాలవనుకోండి అందుకే ఆశీర్వచనం రేటులో పిఫ్టీ పెర్సెంటు డిస్కౌంటు" అన్నాడు తన్మయానందంతో.

'ఎవరది?' అన్నాడు సెకండు హీరోయిను వేషంకోసం ముచ్చటపడ్డాయన.

'కళ్ళు కలువల్లు. ముక్కు నువ్వుపువ్వు. మదుర 'రిఫ్లెక్షన్' ఆ మెరుపూ ఆ తళుకూ నే చెప్పలేను'

'ఒద్దులెండి. అయినా ఆషోకులు మేకపులలో వచ్చేస్తాయి. ఒడ్డుపొడుగు ఉండాలి. ఏపుగా ఉండాలి' అన్నాడు పట్టుపరికిణీ కుట్టించమని డైరక్టరుతో పోట్లాడినాయన.

'వేరే చెప్పాలా మేష్టారు...అచ్చు ప్రబంధనాయికే.' అన్నాడు ఆమెను డిస్కవర్ చేసిన కొలంబస్ మధురస్మృతి పథంలో షికారు బయల్దేరుతూ. అందరూ ఒక నిముషం మౌనం పాటించారు; తాప సూచకంగా, కొందరు సంతాపసూచకంగా.

'అయితే ఒక్క విషయం' అన్నాడు కొలంబస్ కొంటెగా చూస్తూ.

ఏమిటది అన్నాయి ఎనిమిదికళ్ళు; ఒక్క లోపంఉన్నా చాలునన్న ఆశతో.

'ఆ పిల్లకి నడుం లేదు.' అన్నాడు కొలంబస్.

'లేదు?' అన్నాయి ఎనిమిది గొంతుకలు.

'లేదు'

'అస్సలు?'

'బొత్తిగా'

'నిజం?'

'నిజం'

'ఓరిబాబోయ్!' అన్నాయి గొంతుకలు.

'ఆ...మరేవిటనుకున్నారు. నడుం లేదు. అస్సలు లేదంటే నమ్మండి మేష్టార్లూ' అన్నాడు కొలంబస్.

'అంటే రెండు సెపరేట్ ఒళ్లులు అన్నమాట' అంది ఒక గొంతుక అపనమ్మకం ధ్వనిస్తూనే.

'ఒళ్లులు అన్నశబ్దం లేదు. అలాటి బహువచనం ఎక్కడా కనబడదు మీకు' అన్నాడు కొలంబస్.

'మీ గ్రామరు తగలేసిరి. ధస్తుంటే సంధి మంత్రంలా అడిగిందానికి జవాబు చెప్పవయ్యా' అన్నాడు తర్ హీరోయిన్.

కొలంబస్ నిస్సహాయుడైపోయినట్లు చూచి, ఒక్కసారి విరగబడినవ్వేసి 'హోరి మీ యిల్లులు బంగారంగాను!...లేదంటే లేదనా అర్థం....ఛీ చ్చి వారా...వుతినే చమత్కారానికన్నాను...లేదంటే, ఉందా లేదా అనిపించేటంత సన్నంగా ఉందన్న మాట. మిగతా ఖాడీమీద కంపేర్ అండ్ కాంట్రాస్ట్ గా' అని మళ్ళీ పగలబడి నవ్వేశాడు ఆయన.

సభికులకు ఆటే నచ్చలేదు ఈ వివరణ. అనుమానంగా కోపంగా చూశారు.

(56-వ పేజీ చూడండి)

# నక్షత్ర ఫలితాలు

**(6-11-57 మొదలు 12-11-57 వరకు)**

గ్రహ స్థితి.

| | | | |
|---|---|---|---|
| | కే | | |
| | తే7 న బుధుడు వృశ్చికమునకు మారును. మేష, వృషభ, మిథున కర్కాటకములలో చంద్రుడు. | | |
| శు | శ | రవిబురా | గు |

### *అశ్విని [చూ, చే, చో, లా]*

గతవారమున కలిగిన అవయోగము ఇంకా మిమ్ములను వెన్నాడుతునేవుంది. ఖర్చులు ఎక్కువగుటచేతను, సకాలములో డబ్బు రాకపోవుటచేతను మనస్సునకు అస్థిమితము కలుగుతుంది. కోర్టు వ్యవహారములు కొంతవరకూ అనుకూలిస్తాయి. కార్యభారము అధికమవుతుంది. వ్యాపారస్తులకు ఒత్తిడి ఎక్కువ. ఉద్యోగస్తులకు అశాంతి. స్త్రీలతో వివాదము కలుగుతుంది. అనారోగ్యము కలిగే సూచనలున్నాయి. విద్యార్థులకు బద్ధకమువల్ల చదువు సాగదు. 7, 8 తేదీలలో అశాంతి. వారాంతమున కొంత అనుకూలము. శనికి శాంతి చేయడం మంచిది.

### *భరణి [లీ, లూ, లే, లో]*

పోయినవారము కలిగిన గృహ కలతలు మొదలైన అశాంతి, సోదరునివల్ల కోరిన సహాయము రాకపోవుటవల్ల మరికొంత పెరుగుతుంది. మిత్రులు తటస్థముగా వుండుటచేత వారివల్ల నెరవేరుతాయనుకున్న పనులు నిలిచిపోతాయి. ఉద్యోగులకు అధికారుల వత్తిడి ఎక్కువవుతుంది విద్యార్థులు పోటీలలో పాల్గొని దెబ్బలు తగిలి బాధపడతారు. కళాకారులకు వారి కార్యక్రమములో ఆలస్యము జరుగుటచేత నిరుత్సాహముగా వుంటుంది. వర్తకులకు 6 వ తేదీని లాభములేని ప్రయాణము. 7, 8 తేదీలలో అశాంతి. ప్రమాదములు. వారాంతమున సోదరునివల్ల కొంత సహాయము కలుగుతుంది. పూజానకు శాంతిచేయుట మంచిది.

### *కృత్తిక [ఆ, ఈ, ఊ, ఏ]*

గతవారము కలిగిన ఒడిదుడుకులు ఈ వారమున సర్దుకుంటాయి. ఉన్నతాధికారములో వున్నవారి సహాయమువల్ల మీ కార్యములు నెరవేరుతాయి. కొత్త మిత్రులను కలుసుకుంటారు. శుభవార్తలు వింటారు. విద్యార్థులు నూతన విషయాలను నేర్చుకుంటారు. ఉద్యోగస్తులకు ఆర్థిక బాధలు తగ్గి అధికారుల మన్నన కలుగుతుంది. కవులు నూతన కావ్యరచన మొదలుపెడుతారు. వర్తకులకు ప్రయాణమువల్ల లాభము కలుగుతుంది. 7, 8 తేదీలలో త్రిప్పట; అశాంతి. 9 వ తేదీ లగాయతు కళాకారులకు, నటీనటులకు యోగకాలము.

## బి. నరసింగరావు

### * రోహిణి [ఓ, వా, వీ, వూ]*

ఈ వారము మీకు అన్నివిధాలా యోగకాలము. పండితులవల్ల కొత్త విషయాలు తెలుసుకుంటారు. కొంతకాలమునుండి పరిష్కారము కాకుండా నిలిచిపోయిన కార్యములు అనుకూలముగా నెరవేరుతాయి. కోర్టువ్యవహారములలో మీపక్షముగా తీర్పులువస్తాయి. ఆర్థిక పరిస్థితి మెరుగుగావుండుటవల్లనూ అధికారుల మన్నన పొందుటచేతను ఉద్యోగస్తులు తృప్తిగా వుంటారు. పిల్లల అభివృద్ధికి సంబంధించిన చర్యలు తీసుకొంటారు. వ్యాపారస్తులకు లాభము కలుగుతుంది; పండితులకు సన్మానము కలుగుతుంది. న్యాయవాదులకు యోగము. నటులకూ, కళాకారులకూ మేలుకాలము. 6-వ తేదీ ప్రయాణము. 7, 8 తేదిలలో కార్యభారమువల్ల త్రిప్పట; అస్వస్థత. వారాంతమున శుభయోగము.

### *మృగశిర [వే, వో, కా, కీ]*

ఈ వారము మీకు యోగదాయకముగా వుంటుంది. యత్నకార్యములు నెరవేరుతాయి. ఉద్యోగులకు అధికారులదయ కలుగుతుంది. మిత్రులతో వినోదములలో పాల్గొంటారు. సకాలములో ధనాదాయము చేతికి వస్తుంది. వెండి వ్యాపారస్తులకు మంచి లాభము వస్తుంది. శుభకార్యాలలో బంధుమిత్రులతో మృష్టాన్నభోజనము చేస్తారు. విద్యార్థులకు నూతనోత్సాహము. కవులకు సన్మానము కలుగుతుంది. కళాకారులకు, నటీనటులకూ మంచికాలము. 6, 7 తేదీలలో ప్రయాణము. 8, 9 తేదీలలో త్రిప్పట, అశాంతి. 10, 11, 12 తేదీలలో వినోదము, భోగం.

### * ఆరుద్ర [కూ, ఖ, జ, ఛ] *

ఈ వారము కళాకారులతోను మిత్రులతోను వినోదముగా గడుపుతారు. ధనాదాయము ప్రోత్సాహకరముగా వుంటుంది. పుణ్యకార్యాచరణలో భారము ఎక్కువైననూ సహనముతో నిర్వహిస్తారు. కోర్టు వ్యవహారములు మీకు అనుకూలిస్తవి. రత్న, బంగారు వ్యాపారస్తులకు లాభముగా వుంటుంది. విద్యార్థులు ఉత్సాహముగా కొత్తసంగతులను నేర్చుకుంటారు. కుటుంబమందుండు వారికి అలంకారలాభము. ఆప్తులతో తీయనిపదార్థాలను ఆరగిస్తారు. 6, 7, తేదీలలో కొత్తవారితో పరిచయము, ప్రయాణము. 8, 9 తేదీలలో కార్యభారము. 10, 11, 12 లాభము, శుభవార్తా శ్రవణము.

### * పునర్వసు [కే, కో, హా, హీ,] *

మీ రాబడిని అభివృద్ధి చేసుకొనుటకు ఈ వారము పెద్దప్రయత్నాలుచేసి విఫలులై ఆశాభంగముపొందుతారు. కార్యభారము ఎక్కువగుటచేతను, అకాలభోజనమువలను ఆరోగ్యము చెడేసూచన లున్నవి. కోర్టువ్యాపారాలలాంటి కొన్ని కొత్త సమస్యలు మీకు అశాంతిని కలిగిస్తాయి. వ్యాపారస్తులకు ఆర్థికసమస్యలు ఆందోళన కలుగచేస్తాయి; ఉద్యోగస్తులకు మంచికాలముకాదు. గృహమందుండువారికి కావలసిన అవసరాలు తీరకపోవుటచేత కలతలు కలుగుతాయి. విద్యార్థులకు చదువుసాగదు. 6, 7 తేదీలలో లాభములేని ప్రయాణం. 8, 9 తేదీలలో కార్యభారము; అశాంతి. వారాంతమున కొంత ఊరట.

### *పుష్యమి[హూ, హే, హో, డా]*

ఈవారము మీకు అనుకూలముగాలేదు. అనుకున్న ఆర్థికసహాయము సకాలములో కలుగకపోవుటచేతను తలపెట్టిన కార్యములు నెరవేరక మనోవ్యధపొందుతారు; నిందలపాలవుతారు. కానివారాంతములో అజ్ఞాతవ్యక్తుల సహాయమువల్ల, నిలిచిపోయిన కార్యములు జరుగుటచే కొంత ఊరట కలుగుతుంది. మధ్యతరగతి ఉద్యోగస్తులకు వత్తిడికలిగిననూ వారాంతమందు కొంత తృప్తి ఏర్పడుతుంది. ఆరోగ్యమునుగురించి శ్రద్ధ అవసరము. 6, 7 తేదీలలో లాభములేని ప్రయాణము. అశాంతి 8, 9 తేదీలు ఆరోగ్యభంగం, వారాం

తమున కొంత ఆశ.

### *ఆశ్లేష [డి, డూ, డే డో], *

ఈ వారము మీకు మిశ్రమయోగము, అనుకున్న పనులు జరగక పోయినను, ఖర్చులు ఎక్కువ అయిననూ పెద్దల సాంగత్యమువల్ల ఆధ్యాత్మిక చింత కలిగి తద్వారా మనశ్శాంతి కలుగుతుంది. ఉద్యోగులకు యేమంత మంచి కాలము కాదు. వ్యాపారస్తులకు 6, 7 తేదీలలో స్థిమితము లేని ప్రయాణము, అటుపైని స్వల్పలాభము. స్త్రీలతో వివాదము విద్యార్థులకు శ్రద్ధ తక్కువ 8,9 తేదిలలో ఆరోగ్య భంగము.

### * మఖ [మా, మీ, మూ మే] *

ఈ వారము కార్యభారము అధికమవుతుంది. శ్రమకుతగిన ఫలితము లేక అసంతృప్తిని చెందుతారు. కోర్టుపనులలో కొంత అనుకూలత కొంత ప్రతికూలత వుంటుంది. ఉద్యోగులకు మొదట్లో శ్రమవున్ననూ, క్రమముగా అధికారుల దయ కలుగుతుంది. ఇచ్చిపుచ్చుకు నేపట్ల నీచస్త్రీలతో వివాదమువల్ల మనోవ్యధ కలుగుతుంది. 6, 7 తేదిలు కార్యభారము. లాభము లేని ప్రయాణము. 8, 9 తేదిలు శ్రమ, వారాంతము కొంత మేలు.

### * పూర్వ ఫల్గుణి (పుబ్బ) *
### [ మో, టా, టీ, టూ ]

ఈ వారము మీశక్తినంతటినీ ఉపయోగించి ప్రయత్నించిననూ కార్యానుకూలత కలుగదు. అయిననూ నిరుత్సాహపడక ప్రయత్నిస్తూనే వుంటారు అదే క్రమేణా కష్టములను తగ్గించేది అవుతుంది. విద్యార్థులు విజ్ఞానుల సాంగత్యమువల్ల కొత్తసంగతులు నేర్చుకుంటారు. ప్రమాదమువల్ల దెబ్బలు తగులుతాయి. కుజునకు శాంతిచేసుకొనుట మేలు. 6, 7 తేదీలలో నిలకడ తక్కువ. 8, 9 తేదిలలో ప్రమాదములు.

### * ఉత్తర ఫల్గుణి (ఉత్తర) *
### [ టే, టో, పా, పి ]

ఈవారం మీకు యోగకాలము. పదవిలోనుండువారి సహాయమువల్ల ధనాదాయము వృద్ధియగును. కోరువ్యవహారములు అనుకూలముగా వుండును. జ్ఞాతులసహాయమువల్ల శుభకార్యనిశ్చయము చేయగలుగుతారు. ఉద్యోగస్తులకు మేలుగా ఉంటుంది. వర్తకులకు లాభము. విద్యార్థులు ఉత్సాహముగా వుంటారు. కవులకు పండితులకు, కళాకారులకు మేలుజరిగేకాలము. 6, 7 తేదిలలో ప్రయాణము. 8, 9 తేదిలలో కార్యభారము, శ్రమ.

### *హస్త [పూ, ష, ణ, ఠ]*

ఈవారము మీకు యోగదాయకముగా వుంటుంది. ధనాదాయము అభివృద్ధి పొందుతుంది. గతవారము మీకు కలిగిన చిక్కులు కొంతవరకుతగ్గుతాయి. పండితులకూ, న్యాయవాదులకూ మంచికాలము. కోర్టువ్యవహారములలో అనుకూలముగా తీర్పులు వుంటాయి. విద్యార్థులు కొత్తసంగతులు నేర్చుకుంటారు. 8, 9 తేదిలలో కార్యభారము వల్ల శ్రమ ఎక్కువ. 10, 11, 12 తేదిలలో మిత్రదర్శనము. కార్యానుకూలత, సహాయము కలుగును. కళాకారులకు మంచికాలము.

### *చిత్త [పే, పో, రా, రీ]*

ఈవారము మీకు పెద్దలసాంగత్యం కలుగుతుంది. బంధుమిత్రులతో శుభకార్యములలో పాల్గొంటారు. ఆర్థిక స్థితి బాగుపడుతుంది. ఉద్యోగస్తులకు అధికారుల మన్నన కలుగుతుంది ఇంట్లోనుండు వారి ఆరోగ్యము బాగుంటుంది. వర్తకులకు యోగిసుంది. కళాకారులకు, గాయకులకు మంచికాలము. 6, 7 తేదీలలో ప్రయాణము. 8, 9 తేదిలలో ప్రయాసము. ఖర్చులు ఎక్కువ 10, 11, 12 తేదిలలో మిత్రదర్శనము, కార్యలాభము, మృష్టాన్న భోజనము

### * స్వాతి [రూ, రే, రో, తా] *

ఈ వారము బంగారు, రత్నవర్తకులకు లాభము. బంధువులతోనూ, మిత్రులతోనూ వినోదము. ఉద్యోగస్తులకు గౌరవప్రదముగా వుంటుంది. పిల్లల విషయమై తూర్పువైపునుండి శుభవార్త వస్తుంది. విద్యార్థులకు ఉత్సాహకరముగా వుంటుంది. 7, 8 తేదిలలో ప్రయాణము, లాభము. 8, 9 తేదీలలో కార్యభారమువల్ల శ్రమ. 10, 11, 12 తేదీలు మిత్రులతోను, గృహముందుండు వారితోను పిండివంటలతో భోజనము; శుభకార్యచింత. కవులకు, గాయకులకు, కళాకారులకు యోగకాలము.

### *విశాఖ [తీ, తూ, తే, తో]*

ఈ వారము ఆర్థికముగా ఒత్తిడి ఎక్కువవుతుంది. శ్రమ అధికమయ్యేపనులు చేయుటచేత అశాంతి ఎక్కువగా వుంటుంది. కోరువ్యవహారములు తృప్తికరముగా వుండవు. పితృవర్గమువారితో కలతలు; అపేక్షించిన సహాయము రాకుండుట నిరాశ. ఆరోగ్యము భంగమయేసూచనలు కలుగగానే శ్రద్ధవహించడము మంచిది. 7, 8 తేదీలలో శ్రమతో కూడిన ప్రయాణము. 9, 10 తేదీలలో ఆర్థిక లోపము; వివాదము, అనారోగ్యము.

### *అనూరాధ [నా, నీ, నూ, నే]*

ఈ వారము మిశ్రమఫలములు కలుగును. కార్యహానివల్ల మొదట్లో నిరాశ కలిగిననూ వారాంతములో కొందరు మిత్రులు అజ్ఞాత సహాయమువల్ల అనుకూలించి శాంతికలుగును. 6,7 తేదిలలో అనుకోని ప్రయాణము చేయవలసి వచ్చి, ఖర్చులు ఎక్కువ. ఉద్యోగులకు వత్తిడి కలిగిననూ క్రమేణా అనుకూలత కలుగును. 8, 9 తేదిలలో కుటుంబమందుండు వృద్ధులకు అనారోగ్యము, అశాంతి 11,12 తేదిలలో సహాయం, స్వల్పలాభము.

### —ధరలు :—

నూలు, వస్త్రములు: మార్పు లేదు.
నూనెగింజలు: నిలకడగా వుంటవి.
బెల్లము, పంచదార, చింతపండు :- మందముగావుంటవి.
ఆహారధాన్యములు:-మందగించును.
పప్పుదినుసులు: మార్పు లేదు.
వెండి, బంగారము : నిలకడగా వుంటవి. వారాంతమందు బంగారము ధర స్వల్పముగా హెచ్చి మరల తగ్గుతుంది.

అచ్చటచ్చట గాలితోకూడినవానలు, మద్రాసునకు దక్షిణమున సువృష్టి కలుగును.

జన్మనక్షత్రమునుబట్టిగాని, జన్మనక్షత్రము నెరుగనివారు నామనక్షత్రము (వారివారి పేర్లననుసరించి పేరు మొదటి అక్షరము)ను బట్టిగాని ఫలములను తెలుసుకొనునది. కృష్ణుడను పేరునకు మృగశిరా నక్షత్రమును, హృష్ణుడను పేరునకు స్వాతీ నక్షత్రమును, శ్రీధరుడను పేరునకు చిత్తా నక్షత్రమును, క్షేత్రపాలకుడనే పేరునకు హస్తానక్షత్రమును, భీముడు, భైరవుడు అనే పేర్లకు పూర్వాషాఢనక్షత్రమును చూచుకొనునది.

### *జ్యేష్ఠ [నో, యా, యీ, యూ] *

ఈ వారము అనుకున్న పనులు నెరవేరక పోవుటచేత, ఆశించిన సహాయము కలుగక పోవుటచేత మనోవ్యధ ఎక్కువ. గృహకలతలు. అయిననూ ఓర్పుతో కార్యాచరణ చేస్తారు. పండితుల సాంగత్యమువల కొంత శాంతి చేకూరుతుంది. 6, 7 తేదీలలో త్రిప్పట, ఆశాభంగము, వారాంతమందు కొంత శాంతి. కుటుంబములో వారిఆరోగ్యం గురించి కలవరపడతారు. విద్యార్థులకు చదువు సాగదు.

### *మూల [యే, యో, బా, బీ]*

ఈవారము మీకు అనుకూలత కన్న ప్రతికూలత యెక్కువ. కార్యభారము అధికమగుటచేత శ్రమవల్ల అశాంతిగా వుంటుంది. యత్నకార్యములు వెనుకపడతాయి కోర్టువ్యవహారములలో కొంత అనుకూలత వుంటుంది. ఇచ్చిపుచ్చుకొనేపట్ల దుష్టస్త్రీలతో వివాదము, మనోవ్యధ. 6,7 తేదిలలో డబ్బుకు వత్తిడి 8,9 తేదీలలో

#  నక్షత్రఫలితాలు 

వివాదము, అశాంతి, అనారోగ్య సూచన. విద్యార్థులకు అశ్రద్ధ.

***పూర్వాషాఢ [బూ, ధ, భా, ఢ]***

గతవారమందు కలిగిన ధనలోపము ఈ వారము కూడా మిమ్ములవెన్నాడినా సహోదరుని సహాయమువల్ల కొంత సర్దుబాటు అవుతుంది. ఉద్యోగులకు అధికారుల చురుకు మాటలవల్ల మనస్సు గాయపడుతుంది. వాడి గలవాటితో దెబ్బలు, గాయములు తగులుటవల్ల ప్రమాదము వుంటుంది దైవచింత అవసరము. 6, 7 లాభములేని ప్రయాణము 8, 9 తేదీలలో మనోవ్యథ.

***ఉత్తరాషాఢ [బే, బో, జా, జీ]***

ఈ వారము మీ స్వశక్తివల్ల కార్యానుకూలత సాధించి తృప్తిపొందుతారు. మిత్రుల సహకారముకూడా వుంటుంది. విద్యార్థులు ఉత్తమగ్రంథాలు చదివి ఆనందిస్తారు. ఉద్యోగస్తులకు తోటివారి సహకారమువల్ల అధికారుల దయ కలుగుతుంది. కవులకు, కళాకారులకు, నటీనటులకు మంచి కాలము. 6, 7 తేదీలలో ప్రయాణము. 8, 9 తేదీలలో అనారోగ్య సూచన. వారాంతమున లాభము. వర్తకులకు యోగకాలము.

***శ్రవణము [జూ, జే, జో, ఖా]***

ఈ వారము మీకు యోగకాలము. విజ్ఞులవల్ల జీవితమునకు పనికివచ్చే అనేక క్రొత్త సంగతులను తెలుసుకుంటారు. సద్గ్రంథాలు చదువుతారు. సుఖముగా గడుస్తుంది. మీ హోదా, గౌరవము పెరుగుతవి. వృత్తులలోనున్నవారికి అనుకూలత ఎక్కువ. విద్యార్థులకు చదువు చురుకుగా సాగుతుంది. పండితులకు, న్యాయవాదులకు, కళాకారులకు యోగము. 6, 7 తేదీలలో ప్రయాణము. 8, 9 తేదీలు కార్యభారము, శ్రమ. 10, 11 12 తేదిలలో శుభవార్తలు.

***ధనిష్ఠ [గా, గీ, గూ, గే]***

ఈవారము కళాకారులతోనూ, గాయకులతోనూ, బంధుమిత్రులతో కూడి వినోదముగా గడుపుతారు. ఆర్థికస్థితి బాగుంటుంది. వెండిసరుకుల వ్యాపారస్తులకు లాభముగా వుంటుంది. మాతృవర్గమువారి సహాయముతో శుభకార్యాలోచనలు ఫలోన్ముఖమవుతాయి. ఆప్తులతో మృష్టాన్నభోజనము ఆరగిస్తారు. విద్యార్థులకు చదువు శ్రద్ధగా జరుగుతుంది. ఉద్యోగస్తులకు మంచికాలము. కవులకూ, గాయకులకూ, కళాకారులకూ, నటీనటులకు యోగము. 8, 9 తేదీలలో

***శతభిషం [గో, సా, సీ, సూ]***

ప్రస్తుతము మీకు అన్నివిధములా యోగకాలము. చాలాకాలమునుండి పరిష్కారము కాకుండా నిలిచిపోయిన చిక్కు కార్యములు నెరవేరుటవల్ల శాంతి పొందుతారు. ఆదాయము వృద్ధిఅవుతుంది. ఖరీదైన వస్తువులను అమ్మటవల్ల వర్తకులు లాభము పొందుతారు. విద్యార్థులు క్రొత్తవిషయాలు నేర్చుకుంటారు. ఉద్యోగస్తులకు కొంతకాలము నుండివున్న అశాంతి తొలగి కుదుటపడుతుంది. కవులకూ, గాయకులకూ, నటీనటులకూ లాభించేకాలము. 6, 7 తేదీలలో ప్రయాణము. 8, 9 తేదీలలో మాంద్యము.

***పూర్వాభాద్ర [సే, సో, దా, దీ] ***

గత వారమున కలిగిన యోగము క్రమేణా తగ్గుటవల్ల కార్యభారము అధికమై ఉత్సాహాధిక్యము కలుగును. అకాలభోజనమువల్ల ఆరోగ్యము భంగపడినట్లు తెలుసుకోగానే, తగిన శ్రద్ధ తీసుకోవాలి రవికి శాంతిచేయించండి. పితృవర్గము నుండి పొందిన సహాయము మీ అవసరాలకు సరిపడక అస్థిమితము పొందుతారు. విద్యార్థులకు చదువుపై అశ్రద్ధ ఎక్కువ. ఉద్యోగస్తులకు శ్రమఅధికము. 6, 7 తేదీలలో వర్తకులకు లాభములేని ప్రయాణము. 8, 9 తేదీలలో కార్యభారము; శ్రమ.

*** ఉత్తరాభాద్ర [దూ, శం, ఝా, థా] ***

ఈ వారమున మీ ఆర్థికస్థితి బాగుండకపోవుటచేత యత్నకార్యములు అనుకున్నట్లుగా నెరవేరక మొదట్లో నిరుత్సాహము కలిగినను, మీరు కోరకుండా కొందరు స్నేహితులు అక్కరపడి కార్యానుకూలతకు కొంతవరకూ సహాయము చేస్తారు. ఆరోగ్యముగురించి శ్రద్ధ అవసరము. వర్తకులకు, వృత్తులలో నుండువారికి ప్రతికూలత. విద్యార్థులకు చదువు సక్రమముగా జరగదు. 6, 7 తేదిలలో చలనము. 8, 9 తేదిలలో కార్యభారము. నిరాశ. 10, 11, 12 తేదీలలో మిత్రులవల్ల సహాయము, లాభం.

***రేవతి [దే, దో, చా, చీ]***

ఈ వారము అవసరమునకు కావలసిన డబ్బు అందకపోవుటచేత కార్యవిలంబనము కలిగి నిరుత్సాహము చెందుతారు. పుణ్యకార్యముల విషయమై ఎక్కువ శ్రమపడుతారు. ఈశ్వరానుగ్రహమును పొందుటకు తగిన హితవార్తలు వస్తవి. సంసారముపట్ల మీరుచూపే అనాసక్తివల్ల గృహకలతలు పెరుగును. భార్యకుగాని, కుటుంబమందుండు ఇతర స్త్రీలకుగాని అనారోగ్యము కలుగుతుంది, విద్యార్థులకు అనాసక్తి ఎక్కువగా వున్నా క్రొత్తవిషయాలు నేర్చుకుంటారు. 6, 7 తేదిలలో ప్రయాణము, ఖర్చులు ఎక్కువ. 8, 9 తేదీలలో శ్రమ, అశాంతి. 10, 11, 12 స్వల్పలాభము.

★

స్వల్పప్రతికూలత; అశాంతి.

## గమనిక

అక్టోబరు 23వ తేది ఆంధ్రపత్రిక సచిత్రవారపత్రిక ముఖచిత్రం (లంబాడి కన్య) ఫోటో తీసినవారు: శ్రీ పి.వీరన్న (విజయవాడ).

# నటనమే బ్రతుకోయి!

డి. అర్జునరావు

యాదగిరి హుందాగా పైకి లేచి గొంతు సవరించుకున్నాడు. అతని హంగామా చూస్తే దీర్ఘోపన్యాసంతో ఊదరగొట్టడానికి సంసిద్ధమయినవాడిలా అగుపడుతోంది. ఒకమాటు దగ్గి "ఒరేయ్, కాసిన్ని మంచినీళ్ళు!" అంటూ కేక పెట్టాడు. ప్రక్కనేవున్న సేవకపాత్రధారి గాజు గ్లాసుతో మంచినీళ్లు పట్టుకొచ్చి యాదగిరి చేతి కందించాడు. అతను సగం నీళ్ళు త్రాగి గ్లాసు ముందున్న మేజామీద వుంచుతూ అందరినీ ఒక కంట కలయజూసి మందహాసం చేశాడు.

"ఇదిగో, యాదగిరీ! నీనవ్వు చట్టుబండలయినట్టే వుంది కాని, రేపీ వేళకు నాకు రావాల్సిన డబ్బు ముట్టజెప్పకపోయావో నేనింక మీ తైతెక్కల భాగోతగాళ్ళలో ఉండేది లేదు. నిన్ను ప్రేమించినట్టు నటించడం కాదని, నిజంగానే నిన్ను ప్రేమిస్తూ ఉన్నట్టున్నానని మా అమ్మ అంటోంది, నువ్వు ఇందాకా డబ్బు యివ్వకపోవడంవల్ల" అంటూ మీనాక్షి లేచి రుసరుసలాడింది.

"శాంతించు, మీనాక్షీ! శాంతించు! మన కళోపాసనకు మీ అమ్మ కంటకప్రాయమైపోయింది. అహఁ! అలా అన్నానని మాటి అట్టెవిరి చెయ్యకు. ఏనాటికయినా నీ మాతృమూర్తిని మణిమాణిక్యాలతో తుల తూచి పారవెయ్యగలమనే ధైర్యం నాకుంది. ఆ పరిపక్వదశ వచ్చేవరకూ ఆమె వేచివుండడం అందాకా మనం కళామతల్లి కాళ్ళు కడుగుతూనే వుండడం మంచిది. ఇప్పుడు నాదగ్గర దమ్మిడీ లేకపోవచ్చు. రేపు నా జేబులునిండి ఉండవచ్చు. అప్పుడయితే "హా! హతవిధీ! ఈ వేళ అలా అడిగేస్తుందా!" వెనకనే వున్న కుర్చీలో చతికిలబడ్డాడు.

"ఒరేయ్! యీ సంవాదం కట్టిపెట్టి ఏమయినా డికాక్షనునీళ్ళు కాయిస్తున్నావో లేదో యేడవరా ముందు." విలన్‌పాత్ర తీసుకున్న విఠల్‌రావు గుడ్లెర్రజేస్తూ అడిగాడు.

యాదగిరి గుండెలు ఝల్లుమన్నాయి. నిన్నటి రిహార్సల్సుకు ఆచింతపిక్క నీళ్ళయినా లేవని వాళ్ళంతా గోలెత్తిన విషయం తనకు విదితమే.

"అందులోకి పాలున్నాయా?" మీనాక్షి తన పాత్రోచితమైన ఆధిక్యతతో ఉద్దండం చేసింది.

యాదగిరి మాట్లాడకపోవడం చూచి సర్వసేనానిగా నటించబోయే తీక్షణరావు "చెప్పవేంరా దగుల్బాజీ!" అని హుంకరించాడు.

"సోదర, సోదరీమణులారా! దేనికయినా తొందరపాటు కూడదు. అబద్ధంగాడిని లింగంశెట్టి దగ్గరకు బెల్లంకోసం పంపించాను" అంటూ సముదాయించబోయాడు యాదగిరి.

"ఏమిటీ?" నాకు బెల్లమా కలిపిచ్చేది?" మొదటిపదం దీర్ఘాలు తీస్తూ ఆశ్చర్యం వెలిబుచ్చింది మీనాక్షి.

"అబ్బబ్బె, పంచదార"లో పాయికారీగా అన్నాడు.

ఈ కోలాహలంతో నిద్రాభంగమై అందరికీ వెనకతట్టు బెంచిమీద పడుకున్న అబద్ధంగాడు కళ్ళునులుముకుంటూ వచ్చి "లింగంశెట్టి శనివారంపూటా అరువు లేదన్నాడురా" అన్నాడు.

"ఒరేయ్, ఓరిబకుద్ధాయి! అలాగన్నాడని చెప్పకోవద్దట్రా" యాదగిరి వాడిమీద కస్సుమని లేచాడు.

"రిహార్సల్సు అయ్యాక చెబుదామనుకున్నాను. అదిగాక, నువ్వు నాకిచ్చిన పోర్షను ఎంతరా? చివర్న 'ఎవరక్కడ?' అనగానే 'చిత్తం, ప్రభూ! ఏమి సెలవు?' అనడమేనా నాకున్నది. ఈపాటిదానికోసం నువ్వెళ్ళమన్న ఆ శెట్టిదగ్గరకెళ్ళి నువ్వుతినాల్సిన ఆ చీవాట్లన్నీ నేను తినడమా! అంచేత, కుక్కకాటుకు చెప్పుదెబ్బలా వీళ్ళచేత నేనుపడ్డ ఆ చీవాట్లలాంటివే నీకూ తినిపించడం నా యుద్దేశమై యుండు గాబోలు!" అన్నాడు అబద్ధంగాడు మత్తులో ఒళ్ళు విరుచుకుంటూ.

"ఆహాహా! అరె అబద్ధం! మసిపూసిన మాణిక్యానివిరా! తెరమరుగున పడిపోయిన మహానటుడివిరా! ఇంత డైలాగు ప్రాంప్టింగు లేకుండా నువ్వు చెప్పగలవని నే నెప్పుడూ ఊహించలేకపోయానురా!"

"ఛి, ఛీ! నోరుముయ్యరా!" అన్నాడు వెనకనుంచి యెవడో.

"ఎవడ్రా అది?"

"ఈ బుడబుక్కల సాయెబు మాటల్తో మనం పట్టీలు కొడుతున్నాంరా నిజంగా. లేకపోతే కాఫీనీళ్లు తయారుజెయ్యకుండానే మనల్నందరినీ రిహార్సల్సు జరిపించడానికి వీడిదగుండెయా, చెరువుయా? కనుక సలసల మరిగే వేడివేడి పొగలుకక్కే కాఫీకుండ మనమధ్య బెట్టంగే యీనాటకం రిహార్సల్సు జరగడానికి వీలులేదని నేను ప్రతిపాదిస్తున్నాను." అన్నాడింకొక నటకుడు వెంటనే అందుకుని.

"ఒరేయ్! నీ ప్రతిపాదన త్రోసిపారేస్తున్నాను." యాదగిరి మొండికెత్తాడు.

"నువ్వెవడివోయ్ మమ్మల్ని త్రోసిరాజనడానికి? ఓటింగు జరగాల్సిందే" భీష్మించాడు.

"అంతే, అంతే!" అన్నారు అంతాను.

"సరెలెండ్రా, యీ ప్రతిపాదనకు వ్యతిరేకంగా యెంతమంది సమ్మతిని తెలుపుతారో చేతులెత్తండి" అన్నాడు యాదగిరి కళ్ళు తేలవేసి.

మీనాక్షి తల కోమలహస్తాన్ని గాజులతో గలగల మనిపిస్తూ పైకెత్తింది.

అందరూ అప్రయత్నంగా, అనాలోచితంగా; కూడబలుక్కున్న గూనుపుకాణీలా చేతులు ఎత్తేశారు. అబద్ధంగాడు మాత్రం యథాస్థానంలో గుర్రుపెట్టి నిద్రపోతున్నాడు.

"సోదరులారా! విచారించకండి. కుండెడు మంచినీళ్ళు తప్పకుండా పట్టించుకొస్తాను. ఒరే అబద్ధం!" యాదగిరి ఉత్సాహంగా పిలిచాడు.

అబదంగాడు ఉలుకూ పలుకూ లేదు.

"సరే, ముందు రిహార్సల్సు కానీయండి." వెనక్కితిరిగి మిత్రులను ప్రోత్సహించాడు.

"పరబ్రహ్మ పరమేశ్వర!" పాట మొదట్లోనే శ్రుతి ఆకాశాన్నంటుతోంది.

"హోల్డ్, ఇంకొద్దు! అసలే ఎండిపోయిన గొంతులమీద ససేమిరా కృషిసాగదు" యాదగిరి అడ్డుతగలడంతోనే అందరూ ఆగిపోయారు.

"రాకుమారి వినోదిని యిక్కడ ఈ లత మీది కుసుమాన్ని అఘ్రాణించుతూ నిలుచుం-



# నటనమే బ్రతుకోయి !



టుంది. స్థలం, ఉద్యానవనం కదురా బ్రాంప్టర్ ?"

"అవునుసార్!" పళ్ళసందున సగంలో ఆరిపోయిన బీడీపీక తీసి చెవిమధ్య యిరికిస్తూ జవాబు చెప్పాడు అవధాని.

"తరవాత ఏమిటి?"

"మీరొస్తారు!"

"అంటే యెవరు?"

"జోగులాడివేషంలో ఉజ్జయినీ రాకుమారుడు రణధీరుడు"

"బాగు, బాగు! మీనాక్షీ, ఏదీ! రంగం మీదికి దూకు"

"అలాగే" అంటూ లేడిలా గంతువేసి స్టేజిగా నిర్దేశింపబడిన స్థలంలోకొచ్చి నిలబడుతుంది.

"మీనాక్షీ! నా పిలకలో పువ్వు తురుముకుంటాను. నన్నే లతగా భావించి ఆ పిలకలోని పూపరిమళం వాసన చూడు"

"ఒరే, అవధానీ! పిచ్చి వేషాలెయ్యకు"

"ఎఫెక్టుకోసం మరి"

"అదే నీలో వున్న డిఫెక్టు" యాదగిరి అవధానిని మందలించి మీనాక్షిని చూస్తాడు. విలాసంగా వున్న ఆమె ఓరకళ్ళలోని ... మురిపుకు మేను పులకరించి, చేతులు రెండూ ముందుకు చాచి "వినవే బాలా! నా ప్రేమగోలా!" అని పాడుతూ భావుకలాపానికి ఉపక్రమించాడు.

"ఏవండోయ్! అది కాదండీ" తనలో వున్న బాధ కనబడకుండా మొత్తుకున్నాడు ప్రాంప్టర్ అవధాని.

కాని ఆ ప్రేమవిలాపం ఆగలేదు. నిళ్ళల ... లాలపైన పరుగులెత్తే అభంగతరంగాల్లా ముందుకీ వెనక్కీ ఆడుతూ మీనాక్షి మీదిమీదికి వెడుతున్నాడు యాదగిరి.

"నేనుండెందుకింక ? ఈ పదవికి రాజీనామా యిచ్చేస్తున్నాను ఇదిగో మీసెకండు హాండ్ టిక్కెట్టుక్కూ, నాటకం కాపీ యిస్తున్నాను. వచ్చానాయేవిటి నాప్రాంప్టింగు అక్కరలేకపోవడానికి" ప్రాంప్టరు యాదగిరిని ఆ మూడ్‌లోనే పట్టుకుని సతాయించి ... అడిగేశాడు

"ఒరేయ్! నేనెవర్ని ?" ప్రాంప్టర్ని అడిగాడు యాదగిరి.

అవధాని కదులాడలేదు

"అసలు నేనెవణ్ణంటే చెప్పవేమోయ్"

"నువ్వెవడివో నాకేం తెలుసోయ్?"

"హరి నీ పిండాకూడు మండా. యింతకాలం యీ నాట్యకళామండలికి నేను డైరెక్టర్నని నే తెలీదూ, చోద్యం ?"

"ఏడిశావ్! నేను మాత్రం నాకొ యేవిటి ? నీకులా నటించలేననుకున్నావేమో! ఏదీ, మీనాక్షీ, ఇలా రా. ప్రేమ నటనలో మన తడాఖా యేమిటో వీడికి చూపెడతాను" మీనాక్షి చెయ్యిపట్టుకు లాగబోయాడు అవధాని.

యాదగిరి ఛటాల్న అవధాని చేతిమీద కొట్టి "ఛప్ ? దూరంగా వుండు. ఎంతటి సాహసమ్మ?" అంటూ ఉగ్రుడైపోయాడు.

అవధాని రెండడుగులు వెనక్కి తొలగి నిలబడి "మీనాక్షీ! ఒక్కటడిగేస్తున్నా! నన్ను ప్రేమిస్తావా, ప్రేమించవా? చెప్పలేదు గాని చిన్నప్పట్నుంచీ నిన్ను ప్రేమిస్తున్నాను. చెప్పేయ్! ఆ ఆశకూడా నిరాశ అని తెలుసుకుని వీధులవెంట దేవదాసులా వెళ్ళిపోతాను, ఎక్కడో నీ నామస్మరణతో ఎప్పుడో ఎవ్వరికీ తెలియని అగాధంలో తాలి అసువులు వీడుతాను" అని నిక్కచ్చిగ అడిగేశాడు అవధాని తనకేదో బాకీవున్నట్లు.

"ఒద్దండీ ! అవధాన్లుగారూ, మీరేమీ అయిపోవద్దు! మా అమ్మనడిగి చెప్తాగా. కాస్త ఆగండి" మందస్మితంతో గోముగా అంది మీనాక్షి.

"ఇం...దూ? ఇప్పుడే వెళ్ళి తేల్చేసుకుందాము. తాడో పేడో ఇప్పుడే తేలిపోవాలి." అవధాని అధికమయిన తొందర కనబరిచాడు.

"ఒరే, మా నాన్నవికదూ! కాస్త రిహార్సలు అయిపోయేదాకా ఆగు. నీకో దణ్ణం." యాదగిరి అవధాని చిబుకం పుచ్చుకుని బ్రతిమాలుకున్నాడు.

"మాత్రా. ఎలాగుంది నా నటన" అవధాని సగర్వంగా చూచాడు.

"ఓ, అద్భుతం ఇది! అద్భుతంగా వుంది. నువ్వు కాస్సేపుండు. ఏరా! మన కమేడియన్ ఎక్కడ్రా?" నలువైపులా చూశాడు.

కమెడియన్ లటపుటం నోరావలించుకుంటూ వచ్చి నిలుచున్నాడు.

"చెప్పరా నీ డైలాగులు, అందివ్వరా ప్రాంప్టర్" అన్నాడు యాదగిరి.

"ఎవడ్రా ప్రాంప్టర్ ?" అవధాని గర్జించాడు.

"చిత్తం, నే నేరా" అని సర్దుకుని, "ప్రారంభించరా లటపుటం" అన్నాడు.

"డొక్కను సిగరెట్టు పొగ గుక్కెడయినా పీల్చకుండా ఎలారా!" లటపుటం నిస్పృహ కనబరచాడు.

"చచ్చాం, ఒరే అబద్దం! ఇందాక ఎవడో పుణ్యాత్ముడిస్తే రెండుదమ్ములు లాగి వరండాలో పారేశాను—వీడి ట్రేడ్‌మార్కు; అది తీసుకురారా" యాదగిరి నిద్రపోతున్న అబద్ధంగాడిని గట్టిగాకొట్టి లేపి పురుగెత్తమన్నాడు.

అబద్ధంగాడు అక్కడే అయిదు నిముషాలు సర్దుకుని నిలబడి అడుగు ముందుకు వేశాడు. పది...పదిహేను...నిమిషాలయింది, అబద్ధంగాడు తిరిగిరాలేదు.

"వాడు వస్తాడులే, నువ్వు నోరుకదపరా" యాదగిరి లటపుటంగాణ్ణి కోరాడు.

"పోనీ నువ్వెళ్ళి కాస్త చూసిరారా, వాడేమయ్యాడో" అన్నాడు లటపుటం.

"సరె, ఏంచేస్తాం" అంటూ బయటికెళ్ళి మరునిమిషంలోనే తిరిగొచ్చాడు.

"ఒరేయ్, ఆ అబద్ధంగాడూ లేడు, ఆ సిగరెట్టుపీకా లేదక్కడ. వాడే కాల్చి ఇక్కడ్నుంచి పరారీ అయినట్టున్నాడు; పుండాకోరువెధవ! దగాకోరు!" అని ఉగ్రోపంతో యాదగిరి అబద్ధంగాడిమీద పళ్ళు కొరికాడు.

"అదట్టా, ఆ రెండంగుళాలముక్కే నాకీ పాపం, వాణ్ణి అనకు. నేనే కాల్చేశాను. పీటచెక్కమీద పెట్టేవుకదూ?" లటపుటం సత్యసంధత కనబరిచాడు.

"సరి, సరి. తమరే స్వాహా చేశారన్నమాట. ఇహ నేం, కానీ నీసంభాషణలు."

"ఒరేయ్. అదేం లాభం లేదనుకో. సిగరెట్టు పానంతో నా మగతన్నా తీరాలి, లేకపోతే మీనాక్షితో ఒకసారి లవ్వాడనిచ్చినాసరే నా మమత తీరుతుంది" లటపుటం షరతు పెట్టాడు.

"ఏదీ! ఆడుచూదాం" యాదగిరి వెనక్కో అడుగు, ముందుకో అడుగూ వేసి ప్రత్యాలీఢ పాదంలో నుంచున్నాడు.

"అమ్మో, నువ్వలా నుంచుంటే నేనెలా సరసానికిరాను. ఈ విశ్వరూపంముందు నిలబడగలిగే రసికుడెవడు?" లటపుటం తన భయకారణాన్ని వెలిబుచ్చాడు.

"ఛట్, పొండ్రా! ఏమీ చాతకాని వెధవలు!" యాదగిరి అందరినీ యీసడించుకున్నాడు.

అలాగనడంతోనే సర్వసేనాని తీతుణరావు "ఏమన్నావ్?......ఒరే పద్యంరా, శ్రీరాగం...ఆరున్నర...ఆఁ...

ఈధరణీశుపుత్రి గొని యేడకు బోయెదు
వీవు దుర్మతీ!
పాదములంటి నన్ శరణుబొందకబోతివో,
బుఱ్ఱచెక్కలౌ!......

తరవాతరా...వేగా...

"ఔదలనిన్ను బెట్టుకుని" అందించాడు అవధాని.

...ఔదలనిన్ను బెట్టుకుని" యర్చన సేతును జాలిమాపవే...

టక్కున ఆగి "ఛీఛీ! ఏమిట్రా అప్రాంప్టింగు!

(47 - వ పేజీ చూడండి)




శ్రీ దేవేంద్ర సత్యార్థిగారు; జానపద గేయ సంపాదనార్థమై, యావద్భారతదేశము తిరుగుతూ, 1939 వ సంవత్సరములో తెలుగునాటికి వచ్చారు. రాజమహేంద్రవరములో రెండు నెలలున్నారు. ప్రతిదినము నావద్దగల "అనాదృత వాఙ్మయము"లోని ముద్రితాముద్రితములను చదివించుకొంటూ, వివరణలు అడుగుతూ ఉండేవారు.

ఆ సందర్భములో, "వాల్మీకి మహర్షి ఊర్మిళాదేవి విషయములో పొరబడ్డారు" అని శ్రీ ఠాకూరుగారు తమతో చెప్పినట్లుగా, నాతో శ్రీ సత్యార్థిగారన్నారు. అప్పుడు నేను, స్త్రీల పాటలలో గల "ఊర్మిళాదేవి నిద్ర" చూపించి, "మా తెలుగు జానపదకవులు వాల్మీకిమహర్షి పొరపాటును దిద్దినారు" అంటూ ఆపాట అంతా చదివి, నాకు తోచినరీతిని దానిలోని స్వారస్యాన్ని వివరించాను. వారు ఈ పాటను నా వ్యాఖ్యసహితంగా ఇంగ్లీషులో వ్రాసుకొన్నారు.

1942 సం॥ జనవరినుండి, ఏప్రియలు నెలవరకు "మోడరన్ రివ్యూ" అనే పత్రికలో శ్రీ సత్యార్థిగారు విపుల వ్యాఖ్యానంతో వాటిని ప్రకటించారు.

వాల్మీకిమహర్షి నాటి నుండి పాపము ఊర్మిళాదేవికి కావ్యములలో న్యాయముగా ఈయవలసినంతటి ప్రాముఖ్య మీయలేదని వాదించిన శ్రీ సత్యార్థి గారికి జోహారు లర్పించవలసివున్నది.

సీతాదేవితోబాటు ఊర్మిళాదేవికూడ వనవాసానికి వెళ్ళి వుంటే కథ మార్పుచెంది వుండేది. లక్ష్మణుడు ఆమెను వద్దన్నాడు. పతియాజ్ఞ పాటించి, ఆ పతివ్రతామతల్లి ఇంటనే వుండిపోయింది. ఆ పదునాలుగేండ్లూ ఆమె కన్నులుమూసి శయనించింది. రావణుని వధానంతరము, శ్రీరామచంద్రుడు, సీతాలక్ష్మణుల తోను, సైన్యముతోను అయోధ్యకు చేరుకొన్నాడు. అప్పుడు ఆయనకు పట్టాభిషేకం సర్వాంగీకారంగా జరిగింది. తన చెల్లెలినిగూర్చి సీతాదేవి ప్రస్తావించింది. ఇందులో తన స్వాతంత్ర్యమును, లలితహృదయమును గోచరింపజేసింది చూడండి:

"శ్రీరామభూపాలుడు। పట్టాభి
షిక్తుడై కొలువుండగా.

## నేదునూరి గంగాధరం

... ... ... ... ... ... ... ...

సభయంత కలయజూచి। ఏతెంచి।
సంతోషమున జానకి
పతిముఖముజూచి నిలచి। వినయమున।
పట్టె అంజలి గ్రక్కునా
దేవాదిదేవ వినుమా। ఒకమనవి।
తెలిపెను చిత్తగించూ
ముందు మన మడవులకును। పోగాను।
ముద్దుమరది వెంటను
శయనమయి రాగ జూచి। తనచెలియ।
శయనమాయెను ఊర్మిళా
'వద్దు నీవుండు'మనుచూ। లక్ష్మన్న।
మనల సేవింపవచ్చె
నాడుమొదలూ నేటికి। కనుమూసి।
నాతి శయనించియుండె
ఇకనైన ఆనతిచ్చి। తమ్ముణ్ణి।
ఇందుముఖి కడకంపుడీ"

సీతాదేవి, శ్రీరామచంద్రునకు గతచరిత్రను, ఊర్మిళాదేవి నియమనిష్ఠను విన్నవించి లక్ష్మన్నను ఊర్మిళదగ్గరకు పంపవలసిందని ప్రాధేయపడుతూ, తన చెల్లెలి యెడ [illegible] వాత్సల్యమును ప్రకటించుకొంటుంది. అంత లక్ష్మణుడు ఊర్మిళ మందిరానికి వెళ్లాడు:

"కేళీగృహముజొచ్చియు। లక్ష్మన్న।
కీరవాణిని జూచెను
ప్రాణనాయకిపాన్పుపై। కూర్చుండి।
భాషించె వీరవరుడూ"

ఊర్మిళాలక్ష్మణుల సంభాషణ అత్యంత రమణీయంగా ఉంటుంది. పాండవరాణీ మణి పాతివ్రత్యప్రభావమును ఉటంకిస్తుంది ఊర్మిళాదేవి. మొదట ఆయమ్మ కన్ను లతెరవలేదు; పరపురుషుడని ఎంచి 'ప్రతిన పాటించి:

"అయ్య మీరెవ్వరయ్యా। ఈరీతి।
యీగడమ్మలకో సిరీ
ఎవ్వరూలేని వేళ। మీరిపుడు।
ఏకాంతములకో సిరీ
మాతండ్రి జనకరాజు। విన్నను।
యాజ్ఞసేయక మానరూ
మాయక్క బావ విన్నా। మీకిపుడు।
ప్రాణముకు హానివచ్చు
మాయక్క మఱది విన్నా మిమ్మిపుడు।
బ్రతుకనివ్వరు జగతిలో"

పరపురుషుణ్ణి పతివ్రతలు భయపెట్టు విధానం, ముందుగా తండ్రిగారిని, తరువాత బావగారిని ప్రస్తావించి అనక భర్త అనలేక "మా అక్క మఱది" అని ఎంతసున్నితముగా వచియించిందో ఇందులో పుట్టింటి అభిమానం, బావగారియందలి భక్తి, భర్తను తలచుటలోగల లజ్జామాధుర్యము గమనింపదగినవి.

ఆ తరువాత—

"ఒకనాటి గోరిగాదా। ఇంద్రునికి।
మొడలెల్ల హే సమూరొ



# ఊర్మిళ నిద్ర



ఇట్టిద్రోహములు మీరు। ఎరుగుండి।
ఇంతద్రోహముకొస్తురా"

అని మంచిగా హితవుచెప్పింది. కుట్టితుదకు,

"ఆడతోడూబుట్టరా। మాకంటె।
తల్లి లేదా మీకునూ"

అని దీనముగా వేడుకొన్నది. లక్ష్మణుని జవాబులు చాల శాంతముగను, సామాన్యముగను ఉన్నవి.

"జనకులల్లుని గానటే? చేడరో।
సీతమఱదిని గానటే!"

అంటూ తన్నుతాను చెప్పుకొన్నాడు. అయోధ్యను విడిచి వెళ్ళినతరువాత, జరిగిన కథ అంతా క్లుప్తముగా చెప్పి, పదునాలుగేండ్ల ఎడబాటుతో తను పడిన విరహము తెలియచెప్పుకొన్నాడు. భర్త అని తెలిసి కొని, ఊర్మిళ కళ్ళు తెరచిచూచి, తతరపడి లేచి, పతిపాదములకు ప్రణమిల్లింది. పరస్పరాలోకనములు, ఆలింగనములు అయిన తరువాత ఊర్మిళ కొంచెం కోపంతో, కొంచెం కన్నీళ్ళతో, భర్తను చూచి—

"మాతండ్రి జనకరాజూ। మిమునమ్మి।
మరచి కల్యాణమిచ్చె
మానాథతల్లుడనుచు। తెలియక।
మదిని యుప్పొంగుచుండె
చిత్తమొకదిక్కునుంచి। సమయమున।
చిన్నబుత్తురు ఇంతులా"

అంటూ తన వేదనను ముద్దుముద్దుగా వెళ్ళబుచ్చుకుంది. ఎంత సమంజసముగా ఉందో గ్రహించండి. సకల శుభలక్షణమూర్తి, లక్ష్మణుడు,

"తరుణి పదునాలుగేండ్లు। నినువిడిచి।
ధరియిస్తినే ప్రాణము
ఆహారనిద్రలూను। రెరుగనే।
అతివ నీమీద యాన
పుణ్యపురుషుల స్త్రీలను। ఎడబాపిన।
పూర్వజన్మమున మనమూ
ఎన్నెన్ని యుగములైన। ఇది మనకు।
అనుభవించక తీరదూ"

అంటూ, పూర్వజన్మకర్మలను ప్రస్తావనకు తెచ్చి, భార్యను ఓదార్చాడు. ఈ దంపతులకు, పదునాలుగేండ్లకు ఇదే మంగళస్నానమంటూ, కౌసల్య ఆజ్ఞప్రకారం తలంటుస్నానాలు చేయించారు. తరువాత ముస్తాబులు.

"బంగారుపూలపట్టు। ఊర్మిళా।
బాగుమీరా గట్టెనూ
కోటిసూర్య 'దీప్తి'తో। వెలిగేటి।
మేలయినరవికె దొడగ

... ... ... ... ... ... ......

ముత్యాల తిరుచూర్ణము। లక్ష్మన్న।
ముద్దుముఖమున దీర్చెను
రత్నాల కంఠమాలా। లక్ష్మన్న।
రంజిల్ల ధరియించెను"

ఆ లు మ గ లిలా అలంకరించుకొన్నారు. పిమ్మట—

"వెలలేని మాణిక్యము। పతికూడి।
నిలువుటద్దము జూచెనూ
సిగ్గుపడి శిరసొంచుకొ। ఊర్మిళా।
చిరునవ్వుతో నిలచెనూ"

ఎప్పటనుండి వచ్చాయో, ఊర్మిళాదేవికీ సిగ్గుదొంతరలు! ఇది స్త్రీస్వభావం. తరువాత షడ్రసోపేతమైన భోజనాలు చేశారు. ఇంతటినుండి "శాంతమ్మ-సీతమ్మ"- అంటే, వదినా మరదళ్ళ సరసాలు ప్రారంభం—

"చెడే వినవే జానకీ। నీచెలియ।
యూర్మిళా బుద్ధులన్నీ
తమిడిపానుపున సొలసి। యుండె నొక।
పదునాలుగేండ్లు పడతీ
కుందనపు ప్రతిమకళలు। ఈకళ।
ఎందుండి దాగున్నదో
దృష్టితగులాకుండను। నీలాల।
నివ్వాళు లివ్వరమ్మా"

అంటూ సరసోక్తులాడే శాంతతో సీత, వినయముతో సరసాలు ప్రారంభించింది. కన్న కుమారునిపట్ల చూపే గా రా బ ము తో ను, ముద్దుమరది యనెడి మన్ననతోను "అన్న! లక్ష్మణా! నాయనా!" అం టూ పిలిచే మాతృప్రేమతో, మరదిని వెనకేసుకొచ్చి ఆడబడుచుకు సమాధానం చెప్పింది సీతమ్మ.

"ఇంద్ర చంద్రాదులాను। వలపించు।
చంద్రులూ మీ తమ్ములూ
దృష్టితగులాకుండను। నీలాల।
నివ్వాళు లివ్వరమ్మా"

మఱదిని వెనకేసుకొచ్చిన సీతకు శాంత జవాబు:

"అక్కచెల్లెండ్రు మీరు। మిక్కిలి।
సౌందర్యశాలులమ్మా
మా తమ్ములా నలుగురీని। వలపించు।
జాణలకు దృష్టితగులూ"

అవ విని సీత చిరునవ్వుతో

"మాయన్న ఋష్యశృంగు। మనసులో।
కూడి ఎడబాయకున్న
యేమి యెరుగని తపసిని। ఓ వదినె।
కళించి విడిచినావు"

అంటుంది. ప్రయ్యలు పడకుండ, సెయ్యంబున, తియ్యగా జరిగిన ఈ వదినామరదళ్ళ సంవాదం వింటే, మనము ముగ్ధులం కావలసిందే.

ఊర్మిళా లక్ష్మణులు శయ్యాగృహం చేరాక ముచ్చటలు:



స్వతంత్రభారతి —ఎ. బి. శంకరశాస్త్రి

"కీలుకొప్పమర విడిచి। లక్ష్మణుడు।
వేళ్ళతో జడలల్లెను
బొడ్డు మల్లెల జాజులు। జడపయిని।
శృంగారముగ జుట్టెను
తాంబూలములు నమలుతూ। దంపతులు।
కలపిముచ్చటలాడుచూ"

ఈ సమయమున ఊర్మిళ సంతోషముగా ఉంటుంది. భర్తతో ముచ్చటలాడుచు, తన అక్క చెరబోయినవిధము చెప్పుమని భర్తను మృదుమధురముగా అడుగుతుంది.

"రామలక్ష్మణులు మీరూ। ఉండగా।
రమణెట్లు చెరబోయెనూ?
సింహవిక్రములుమీరూ। ఉండగా।
సీతెట్లు చెరబోయెనూ?
రాజ్యాధిపతులుమీరు। ఉండగా।
రమణెట్లు చెరబోయెనూ?"

భార్య ప్రశ్నపరంపరలకు, జవాబు ఏది చెప్పాలో, ఎలా చెప్పాలో లక్ష్మన్న ఆలోచించేరు. అయోధ్య విడిచినది మొదలు తిరిగి చేరుకొనేవరకు జరిగిన కథను పూస గ్రుచ్చినట్లు చెప్పేడు. ఈ పాటకు ఫలశృతి కూడా ఉంది.

"ఊర్మిళా విరహమ్ములూ। ఇదిఎవరు।
పాడినా, విన్నగాని
శ్రీ విష్ణు కైవల్యము। సౌమిత్రి।
విష్ణులోకము నిచ్చునూ"

ఈ విధంగా ఈ పాట ముగింపబడింది. నాచేతనైనంతవరకు, ఈవిధముగా యత్నించి అందలి యొప్పులను, తప్పులను సహృదయులకే అప్పగించి, నేను తప్పుకొనుచున్నాను.



# వాన వెలిసింది

గుళ్లో పూజచేసి ఇంటికి మళ్లింది విమల. బళ్లో పాఠాలు చెప్పి ఒంటరిగా వెళ్తాడు వేణు.

క్రొత్త పెళ్ళికూతురులా అలంకరించుకుని మెల్లమెల్లగా నడుస్తూంది విమల- ఆమె మనసు అనాసకాయ లాగుంది!

మొద్దుకొని మొత్తుకొని విద్యార్థుల బుర్రల్లో క్రొత్త విజ్ఞానం నింపి వస్తున్నాడు వేణు-అతని మనసు పనసకాయ లాగుంది!

విమలను చూడగానే కమలంలా వికసించాడు వేణు.

వేణును చూడగానే వీణ మీటినట్లయ్యింది విమలకు.

'ఇంత చక్కగావున్న విమలను ఏమని వర్ణిద్దామా?' అనుకున్నాడు వేణు.

'విమలమీద ఓ ఇరవై పద్యాలు వ్రాస్తే బాగుంటుంది-కాని. ఇదేమిటి? ప్రబంధ కవుల్లాగ స్త్రీవర్ణనకు యిన్ని పద్యాలు వ్రాయడం-భావకవిలా ఒక్క ముక్కలో పలికితే సరిపోతుంది' అనుకున్నాడు.

వెంటనే 'ప్రక్కింటి పిన్నిగారి పెరట్లో ముద్ద బంతి పువ్వులాగుంది విమల' అనేశాడు వేణు.

'పెండ్లి చేసుకోనని పంతం పట్టేవాళ్లకు ఈమెను చూపిస్తే సరి—విశ్వామిత్రుడిలా తల్లక్రిందు లౌతారు—పోనీ గాని ఇవ్వాళ తప్పని సరిగా విమలను పలకరిద్దాం' అనుకున్నాడు. ఇద్దరూ ఎదురుపడ్డారు.

'ఒంటరిగా వస్తున్న వేణును తలెత్తి చూద్దామా' అనుకుంది విమల.

'విమల భూస్వామి ఏకైక పుత్రిక-నాకివ్వరు. కాని ప్రయత్నం మానకూడదు' అనుకున్నాడు వేణు.

'వేణు బి. ఎ. బి. ఇడి. చదువుకున్నాడు నాతో మాట్లాడుతాడా? నన్ను థర్డ్ ఫారంతో మాన్పించారు మా వాళ్ళు. అయినా నాకేం?' అనుకుంది విమల—సగర్వంగా—

ఇద్దరూ మరీ దగర కొచ్చారు.

'అరెరె...దాటిపోతుంది. మాట్లాడితే బాగుండును. ఏమైనా అందామా? మళ్ళీ యింత అవకాశం రాదు...'

'దాటిపోతున్నాడు. తలెత్తి చూద్దామా? ఇంతవరకు అయన్ని తలెత్తి చూడలేదు.'

'అయ్యయ్యో...మీ వెనకాల! అదిగో!' అని పెద్దగా అన్నాడు వేణు. గుండె జల్లుమందో లేదో తెలియదు. కాని ఎగిరి ఒక్క గంతు ముందుకు వేసింది విమల.

ఆ కుదుపుకు కదిలిపోయిన గులాబిపువ్వు ఆమె జడలోనుండి దూకింది.

ఆ పువ్వును ఒడిచి పట్టుకున్నాడు వేణు.

'మీ పొడవైన జడను పామనుకున్నాను అని అందామా?' అనుకున్నాడు వేణు.

విమల వెనుదిరిగి వేణుకేసి చూసింది.

గులాబి పువ్వు ఘుమ ఘుమను ఆస్వాదిస్తున్నాడు వేణు—సన్నగా నవ్వుతూ—

'కిరీటంలేని కృష్ణదేవరాయలు లాగున్నాడే!' అనుకుంది. విమల.

'అయ్యో, నా పువ్వు పోయిందే!' అన్నట్లు చూసిందామె.

## మిక్కిలి సుందరరావు

'దొరికిన సొమ్ముకు దొంగా?' అన్నవి వేణు కళ్లు.

'నా పువ్వు యిచ్చెయ్యండి.' అని అందామనుకుంది విమల.

'ఈ పువ్వును నేను' లవ్ 'చేశాను' అందామనుకున్నాడు వేణు. కాని యిద్దరూ ఫేలయ్యారు.

'నీ చూపులు ఎంత చల్లగా వున్నయో' అనుకుంది విమల.

'వేణూ చూసే కోణాల ప్రభావం అది—'అన్నది వేణు మనసు—విమల మనసుతో—

'ఇదేమిటి యింతసేపు నిలబడ్డాను.—తప్పు!...' అనుకుని దాటిపోయింది విమల.

'పువ్వు యిస్తే తీసుకునేదేమో' అనుకుని వెళ్లిపోయాడు వేణు.

విమల యింటికివెళ్ళి తండ్రికి ప్రసాదం యిచ్చింది.

"మీ అమ్మను పిలువమ్మా" అన్నాడు కృష్ణమూర్తి ప్రసాదం సేవిస్తూ.

"అమ్మ పిన్నిగారింటికి వెళ్లింది. ఎందుకు నాన్నా?" అన్నది విమల.

"మరేం లేదమ్మా, మన యింట్లో అద్దెకుంటున్నాడే వేణుగారు. ఆయన వున్నాడేమో—చూడమందామని—"

విమల వూరుకుంది.

"వేణు పెండ్లికాని కుఱ్ఱవాడు. మన ఇంట్లో అద్దెకుండడం, యేమంత బాగుంటుంది—చెప్పు...ఏమంటావ్?"

"నేనేమంటాను నాన్నా" అన్నది విమల ముభావంగా—

ప్రక్కింటి పిన్నిగారి చిట్టిపాప పరుగెత్తు కొచ్చింది—

"పెద నాన్నా, అక్క నన్ను తీసుకెళ్ళకుండా ఒక్కతే వెళ్ళింది గుడికి" అన్నది.

కృష్ణమూర్తి చిట్టిపాపను కౌగిలించుకొన్నాడు.

"పోనీ, చిట్టెని కూడా తీసుకెళ్లకపోయావా, అమ్మా" అన్నాడు విమలతో.

"త్వరత్వరగా నడవలేదు నాన్నా—ఇక వర్షంవస్తే నన్ను చంపుకుతింటుంది ఎత్తుకోమని."

"సరేలే వుండమ్మా-మా బంతిచెట్టు రెండు ముద్దబంతిపూలు వేసింది. నీకిస్తానేంటే?" అన్నది చిట్టి మురిపించుకుంటూ—

కృష్ణమూర్తి లేచి పైపంచ భుజాన వేసుకొని, చెప్పులు తొడుక్కొని, చేతికఱ్ఱ పట్టుకొని చుట్ట, వెలిగించుకొని, మీసాలు దువ్వుకుంటూ బయటికి వెళ్లాడు—కోటప్పకొండ ప్రభలాగ కదిలి—

వేణు వచ్చి తన గదితలుపు తెరుచుకొని, గులాబిపువ్వు బల్లమీద పెట్టుకొని బూట్లు విడిచి, ఇన్‌షర్టుకు విశ్రాంతి కలిగించి, పైజామా, లాల్చీ ధరించి, రేడియోబల్ల దగ్గర కూర్చున్నాడు.

"అదుగో మాష్టారొచ్చాడు. రేడియో పాడుతోంది" అని చిట్టిపాప విమల దగ్గర నుండి వేణు గదిలోకి పరుగుతీసింది.

వేణు విమలకు చిన్న లేఖ వ్రాశాడు.

"చిట్టీ, ఈ చీటీ తీసుకెళ్ళి మీ అక్కకిచ్చి వస్తావా?" అన్నాడు.

"మా అక్కకు నేనివ్వనండి. మా పెద్ద నాన్న కిస్తాను" అన్నది చిట్టి.

వేణు ఆశ్చర్యపోయాడు.

ఈ మాటలు విమలకు వినిపిస్తూనే వున్నాయి.

"ఎందుకని?" అన్నాడు వేణు.

"మా అక్క నన్ను గుడికి తీసుకువెళ్లలేదు."

"ఓ—అదా...అయితే మీ అక్క చెప్పినపని చెయ్యకు. మరి ఇది నేను చెప్పిన పనికదూ–చేస్తావా?"

"చేస్తే నాకేమిస్తావ్?"

"నీవు ఏది కోరుకుంటే, అదిస్తాను."

"అయితే నాకు మీబల్లమీదున్న గులాబి పువ్వు కావాలి."

వేణు సందిగ్ధావస్థలో పడ్డాడు.

"ఈ పువ్వు నీ పగవాళ్లదిలే—నిన్ను సినిమాకి తీసుకెళ్తాగా."

"అయినా, అవాడిపోయిన బోడి పువ్వు ఎవరికో కావాలి?" అని ఉత్తరం తీసుకొని వెళ్ళిపోయింది చిట్టిపాప.

ఉత్తరం వెళ్ళినప్పటినుండి వేణుకి ఎన్నో ఆలోచనలొచ్చాయి. బోలెడుభయం పుట్టుకొచ్చింది. ఆమెను పొరబాటుగా అర్థంచేసుకున్నానేమో? ఒకవేళ ఆమె ఆలేఖ కృష్ణమూర్తిగారికి చూపిస్తే! ఆయన భార్య సుబ్బమ్మ ముక్కోపి!

అసలు ఈవూళ్ళో వుద్యోగం చెయ్యడానికి వీలవుతుందా? ఉత్తరం వ్రాయకుండా వున్నా బాగుండేది.

అసలు వ్రాయడమే మంచిది. తాడో పేడో తేలిపోతుంది. విమల నన్ను నగుబాట్లుపాలు చెయ్యదుకదా?

క్రొత్త ఆలోచన!—

ఇప్పుడు ఇంట్లో ఎవ్వరూ లేరు. పిలిచిఅడిగితే...అదేమంచిది.

విమలఅకస్మాత్తుగా వరండాలోకొచ్చింది.

వేణుకూడా వరండాలోకొచ్చాడు.

విమల పెళ్ళికొడుకులా తల యెత్తుకుంది!

వేణు పెళ్ళికూతురులా తల దించుకున్నాడు!

"ఉత్తరం అందిందా?" అన్నాడు ధైర్యం తెచ్చుకుని.

"ఓ...కాని అర్థంకాలేదు" అన్నది విమల తలయెత్తుకునే!

"తెలుగేగా? అర్థంకాలేదా?"

"కాలేదు"

"మరేంలేదు. నేను మిమ్మల్ని ప్రేమిస్తున్నాను,"

"గోవిందా!...గోవిందా!" అనుకుంటూ యాత్రికులు తిరుపతివెళ్తూ కేకలు వేస్తున్నారు–బైట రోడ్డుమీద.

"ఏమంటారు?" అన్నాడు వేణు.

"ఓ...యస్...ప్రేమించండి" అన్నది విమల.

"మరి మీరు?"

"ఎలా?"

"ఏం?"

"మా నాన్నగారినడిగి...వారు అలాగే నంటే చూద్దాం"

విమలకు నవ్వువచ్చింది.



తెలుగు వనితల గోరింటాకు పండుగనాడు పిల్లలతో తల్లి

—చిత్రకారుడు: వల్లటూరి పూర్ణానందశర్మ.]

## వాన వెలిసింది

వేణుకి అయోమయంగావుంది.

ఇంతలో సుబ్బమ్మ యింట్లోకొచ్చింది.

వేణు గదిలోకెళ్లాడు.

చిట్టిచేత జవాబు పంపుతుందేమోనని ఎదురు చూశాడు వేణు. చిట్టి రాలేదు. ప్రతిరోజూ పెద్దపెద్దగా మాట్లాడు తుంటే విమల మౌనంగా వుంది—

ఆరాత్రి వేణుకి సరిగ్గా నిద్రపట్టలేదు. తలుపు తెరచుకొని మధ్యరాత్రిలో బయటి కొచ్చాడు. నల్లని మేఘాలు తెల్లని ఆకాశాన్ని కప్పివేస్తున్నాయి.

లోనికి వచ్చి పడుకున్నాడు.

విమల దుఃఖిస్తూ వుండగా తాను పరాయి యువతి మెడలో మంగళసూత్రం కడు తున్నట్లు కల వచ్చింది.

తెల్లవారింది.

కాని వేణు అలాగే పడుకుని ఆలో చిస్తున్నాడు. బయటికి పోవడానికి మనస్సు ఒప్పుకోవడం లేదు.

'రాత్రి వాళ్ళంతా మాట్లాడుకుని ఏదో ఒక నిర్ణయానికి వచ్చివుంటారు. వాళ్ళ ముఖాలు ఎలా చూసేట్టు?' అనుకున్నాడు వేణు.

"నేను అనుకుంటూనే వున్నాను. అంత పనీ జరిగింది...అయ్యయ్యో, ఇలా అయితే ఎలా?" అని ఏకరువుపెడుతుంది సుబ్బమ్మ- ఆమె చిమ్మే కసువు కొండంత యెత్తున వేస్తుంది! వేణుకి తలతిరిగినట్లయ్యింది. ఇక మంచంమీదనుండి. లేస్తే మర్యాద దక్కదనుకున్నాడు. అలాగే ముసుగుతన్ని పడు కున్నాడు.

ఎవరో తలుపు తట్టిన చప్పుడయ్యింది.

వేణుగుండె జారిపోయింది.

"వేణూగారు, వేణూగారూ, కొంచెం తలుపు తీస్తారా?"

ఆపిలుపు, కృష్ణమూర్తిదని తెలుసు కున్నాడు వేణు. లేచిపోయి తలుపు తీశాడు.

"మీరు ఈగది..." అన్నాడు కృష్ణ మూర్తి.

వేణుకి వెట్టిధైర్యం వచ్చింది.

"వెంటనే ఖాళీచెయ్యమంటారు. అంతే కదూ?"

"ఖాళీచెయ్యవలసి వచ్చేదే...కాని"

"ఆఁ!..."

"అదే—మీరు దయచేసి అమ్మాయి విమలకు ఇంగ్లీషు ప్రైవేటు చెప్పాలి. అమ్మాయి మీవద్ద నేర్చుకోవాలంటున్నది. మీరు ఏమంటారో కనుక్కుందామని..."

కృష్ణమూర్తికి చెయ్యెత్తి దండం పెట్టాలనిపించింది వేణుకి—

"అలాగే, మీయిష్టం" అనేశాడు అప్రాప్తుగా వేణు.

"అయ్యయ్యో, నేను బీరపాదు లేసను కున్నాను. సొరపాదులు కూడా కొట్టేశాయండి పాడు ఎలుకలు!" అన్నది అవతల సుబ్బమ్మ కసువు చిమ్ముతూనే!

బైట చిన్నచిన్న చినుకులు పొన్న పువ్వుల్లా రాలుతున్నాయి.

వేణుకి మాత్రం వాన వెలిసినట్లయ్యింది!



# అక్కన్న మాదన్నల మహేశ్వరం

ఆంధ్రులలో అక్కన్న మాదన్నల పేర్లు విననివారరుదు. వీరు గోలకొండ నవాబు అయిన అబుల్ హసన్ తానీషా క్రీ. శ. (1658-1687) కాలములో గొప్ప పదవుల నాక్రమించి, అతని మన్ననను, ప్రజల భక్తి ప్రేమలను సంపాదించారు. అక్కన్న పెద్దవాడు; మాదన్న చిన్నవాడు. వీరు ఏకోదరులు కారనీ, బాంధవ్యం కల్పించుకొని సోదరులవలె మెలగినారనీ కథ ఒకటి వాడుకలో వున్నది. మాదన్న మొదట నవాబువద్ద ప్రవేశించి, కార్యదక్షతచే ముఖ్యమంత్రి అయినాడు. మాదన్న ప్రాపకముచేతనే, 1682 లో అక్కన్న షాహీలష్కర్ (సైన్యాధిపతి) మహమ్మద్ ఇబ్రహింకు బదులుగా అయినాడు.

హైదరాబాదు నగరానికి సమీపంలో వున్న అక్కన్న-మాదన్నల నివాస స్థలమనే "మహేశ్వరం" అను గ్రామాన్ని స్వయంగా జూసి గ్రంథస్థములైన విషయాలు, స్థానిక వ్యాప్తములైన సమాచారములతో ఎంతవరకు సమన్వయమవుతాయో కనుక్కోవలెనని చాలకాలంనుంచి కుతూహల పడుతుండే వాడిని. అదృష్టవశాత్తూ, మహేశ్వర నివాసి అయిన ఒక పురోహితుడు ఒకరోజు మా ఇంటికి రావడం తటస్థించింది. ఆయన చెప్పిన విషయాలు విని ఆశ్చర్యపడి ఒకసారి వారివూరికి రావలెనని వున్నదన్నాను. వారు సంతోషంగా ఆహ్వానించారు. మహేశ్వరము వెళ్ళి అక్కడ, కన్న విన్న విషయాలనే ఇక్కడ వ్రాస్తున్నాను.

హైదరాబాదు నగరంలో "చార్ మినార్" నుంచి బయలుదేరి, పట్టణానికి ఆనుకొనివున్న కేశవగిరి (లేక, చంద్రాయన్ గుట్ట) దేవాలయ సమీపస్థలాన్ని చేరాను. ఇక్కడనుంచే మహేశ్వరమునకు ప్రయివేటు సర్వీసుబస్సు వుంది. ఇక్కడికి మహేశ్వరం సుమారు 20 మైళ్ళు. ఛార్జి ఒక రూపాయి. మధ్యాహ్నం రెండున్నర గంటలకు బస్సు బయలుదేరింది. మొట్టమొదట తగిలే గ్రామం బాభాషేర్ ఫుద్దీన్ పహాడ్.



మాదన్న

ఇక్కడ గుట్టమీద 'బాబాసాహెబు' అని ప్రసిద్ధిగాంచిన ముసిం సాధువు ఒకప్పుడు వున్నందువల్ల దీనికీపేరు వచ్చింది. ఇది ఇప్పుడు కూడ ముస్లిం యాత్రికులకు పుణ్యస్థలము. హైదరాబాదునుంచి ఇక్కడికి ప్రభుత్వపు బస్సు సర్వీసు కూడ వుంది. ఇక్కడినుంచి కొన్ని మైళ్ళ దూరంలో తుక్కుగూడెం (సర్దార్ నగర్) అనే పల్లె ఒకటి వుంది. అక్కడివరకు పక్కా రోడ్డు వున్నది. ఇక్కడి నుంచే మహేశ్వరమునకు పోయే బండిబాట ప్రారంభమవుతుంది.

ఏ పట్టణంతోనూ సంబంధం లేక ఇంతవరకే పక్కా రోడ్డు ఉండటం వింతగా తోచి కారణం విచారించాను. వెనుకటి నైజాము కాలములో టిప్పుఖాన్ అనే సర్దారు డొకడుండేవాడనీ, అతడు ఇక్కడ ఒక మామిడితోట వేయించాడనీ (ఇప్పటికీ ఈ తోట ఉన్నది) దానిలోని మామిడి పండ్లు చాలా పెద్దవిగా వుండి, ఆశ్చర్యం గొలుపుతుండేవనీ ఆ పండ్లను నైజాముకు పంపగా, చాలా మెచ్చుకుని, ఆతని ఉంపుడు కత్తెతో సహా తోటను సందర్శించాడనీ, ఆ తోట ఆమె కివ్వబడిందనీ ఆమె రాకపోకలకై ఈ పక్కా రోడ్డు వేశారనీ తెలిసింది.

తరువాత మంకాల అనే గ్రామము వస్తుంది. ఇది కొంచెము పెద్ద ఊరే. మహంకాళి దేవాలయమేదేనా వుండి 'మంకాల' అనే అపభ్రంశనామము తురకలచే పెట్టబడడం జరిగిందేమోనని శంకించి కొందరి నడిగి చూశాను గాని, సరి అయిన సంగతి తెలియలేదు. సాయంత్రము నాలుగు గంటకు మహేశ్వరము చేరాను. మహేశ్వరమనే పేరుగల గ్రామాలు ఇతరచోట్ల కూడా ఉన్నందున, దీనిని మంకాల మహేశ్వరమని పిలుస్తారు. ముస్లింలకు ఇంత కఠిన శబ్దము నోరు తిరుగక "మంకాల మైసరం" అనే ఉచ్చరించడం రివాజయింది.

మహేశ్వరం ఒక పురాతనమైన బస్తీ. అయిదువందల ఇండ్లు వుంటవి. కొంతమంది ధనవంతులు కూడా వున్నారు. కాని విద్యావ్యాప్తిలోనూ నాగరికతలోనూ చాలావెనుకబడి వున్న పట్టణం.

నన్ను ఆహ్వానించిన పురోహితుని పేరు

కొమ్మవరపు సుబ్బారావు

కాశేపల్లి నరసింహశాస్త్రి గారు. వారి తల్లి 80 ఏండ్ల ముదుసలి. ఆమె మామగారు ఆమెకు చెప్పుతుండిన విషయాలను వినవలెననే నేను మహేశ్వరమునకు వెళ్ళాను. ఆమె తెలిపిన విషయాలను విన్నాను.

మహేశ్వరములో అక్కన, మాదన (నకారవత్తు లేకుండ) శబ్దములు వాడుకలో వున్నవి. శ్రీ కే. లక్ష్మణరావుగారు వ్రాసినట్లు వారి ఇంటి పేరు "పింగళి" వారని అక్కడ ఎవరికీ తెలియదు. ఇదిగాక, వారి పూర్వీకుల పేర్లుగాని, మాదన్నగారి కుమారుడని చెప్పే "మలప్ప" పేరుగాని అక్కడ వాడుకలో లేదు. తెలుగు వారి సాంప్రదాయ సిద్ధమైన ఇంటిపేరు వాడుకలో లేకపోవడం చేతను, వారు ధరించిన మహారాష్ట్రి సాంప్రదాయపు ఉడుపుల వల్లనూ వీరు మహారాష్ట్రులై జీవయాత్ర కోసం ఇక్కడికివచ్చి వుండాలనే అనుమానము కలుగవచ్చును.

నన్ను ఆహ్వానించిన శాస్త్రిగారితో వారి ఇంటికి ఒక ఫర్లాంగు దూరంలో మాత్రమే వున్న అక్కన్న, మాదన్న, నివాస స్థలములు చూడానికి వెళ్ళాను. మొట్టమొదట ఒక విశాలమైన దేవాలయగర్భ గుడిస్థలమున్నది. దాని ఎదుటిభాగము ఒక పెద్ద మసీదుగా మార్పు చేయబడినది. అది ఇప్పటికి కూడా మసీదుగానే ఉన్నది. ఇది ఏ దేవాలయమో తెలిసికోడానికి వీలులేకుండ నాశనం చేయబడినది. దీనికి కొంత దూరములో ఒక పెద్ద ఆవరణమున్నది. మధ్య రెండు గుళ్ళున్నవి. ఒకటి శివాలయము, రెండవది విష్ణ్వాలయమని చెప్తారు. కాని, విగ్రహములు లేవు. వాటి ముందు ఒక మండపమున్నది. దీన్ని కళ్యాణ మండపమంటారు. దీనిని అనుకునే ఒక దిగుడు బావి వుంది. దేవాలయములకు చుట్టూ రెండు పంక్తులలో ఒకేసారి వేయిమంది భోజనము చేయడానికి వీలైన పెద్ద వసారా వున్నది. శివ, వైష్ణవ భేదం లేకుండా అక్కన్న మాదన్నలు ఇక్కడ ప్రతిరోజూ పూజలు జరిపి, పగలు పన్నెండు గంటలకల్లా, సహస్ర బ్రాహ్మణులకు ఔపోసన వేసుకొని భోజనానంతరము గోలకొండ వెళ్ళేవారట. ఈ దేవాలయములలోగాని, వసారాలోగాని, శిల్ప చాతుర్యము లేదుగాని, వాడబడిన ఏకాండపు రాళ్ళు అద్భుతంగా మలచబడినవి. కటడములుకూడా చాలా బలిష్ఠంగావుండి కొద్ది మరమ్మతుతోనే, పనికిరాగల స్థితిలో వున్నవి. ఇప్పుడు ఇవి చాల అపరిశుభ్రముగావుండి ఊరి వారి గడ్డిగోదలకు ఉపయోగపడుతున్నవి. వరండాగోడే ఆవరణ ప్రాకారం కనుక, మూలలకు బురుజులను కూడా తరువాత కట్టినట్లు చెప్పబడుతున్నది. ఈ దేవాలయముల ఆవరణపు గోడను అనుకొని ముందువైపు ఊరున్నది.

ఈ దేవాలయ ద్వారముదాటి కొంత దూరంపోగానే, 'శివగంగ' అనే కోనేరు వస్తుంది. ఇది చక్కటి మెట్లు కలిగి, నీళ్ళతో నిండి వున్నది. లోపల నలువైపుల మంచి ఊట బావులున్నవని చెబుతారు. ఈ కోనేరుకు నలువైపులా, మధ్యను, మొత్తం పద్దెనిమిది చిన్న గుళ్లున్నవి. వీటిలోగూడా దేవతా విగ్రహాలు లేవు. ప్రతి గుడిద్వారము మీదా తెలుగుభాషలో దేవుని పేరు చెక్కబడి వున్నది. అవి ఇట్లున్నవి: (1) అఘోరేశ్వరుడు, (2) అమరేశ్వరుడు (3) అమృతేశ్వరుడు, (4) గంగాధరేశ్వరుడు (5) ఇష్టకామేశ్వరుడు (6) ముక్తేశ్వరుడు (7) కాళహస్తీశ్వరుడు (8) టకాంబికేశ్వరుడు (9) మణికర్ణికేశ్వరుడు (10) మహానందీశ్వరుడు (11) అరుణేశ్వరుడు (12) కాశిపతేశ్వరుడు (13) మంగళ గౌరీశ్వరుడు (14) రామేశ్వరుడు (15) మహేశ్వరుడు (16) ఆముక్తేశ్వరుడు (17) అగస్త్యేశ్వరుడు కోనేరుకు మధ్యభాగమున 18 వదియగు చంద్రమౌళీశ్వర ఆలయము కలదు. దీనిని చేరుటకు నీటిమీద


అక్కన్న

వంతెన ఒకటి కట్టబడి వున్నది. అక్కన్న మాదన్నలు మహారాష్ట్రులు కారనుటకు ఇక్కడ మహారాష్ట్రమున ఒక అక్షరమైనను లేకపోవుటే నిదర్శనము.

ఈ శివగంగ విషయమున చరిత్రలో వ్రాసిన కథ, స్థానికంగాకూడ వాడుకలో వున్నది. ఒక ముసల్మాన్ సర్దారుడు ఢిల్లీ నుంచి గోలకొండకు వెళ్ళుతూ ఈ శివగంగలో తన గుర్రమునకు నీళ్ళు పెట్టుకొనడమో లేక స్నానము చేయడమో జరిగిందనీ, కనుక అది అపవిత్రమైనట్లు మాదన్నకు తెలిసి ఆ సర్దారుని పట్టి తెప్పించి, వ్రేళ్ళు కొట్టించెననియు, ఆ తెగిన వ్రేళ్ళతోనే అతడు గోలకొండకు వెళ్ళి తానీషాతో మొర పెట్టుకొనుటకు ప్రయత్నించెననీ; కాని నవాబు దర్శనమే కానందువల్ల మరల ఢిల్లీ వెళ్ళి ఔరంగజేబును దర్శించి ముస్లింపాలకుని దేశములో తనకు గలిగిన పరాభవమును విన్నవించుకున్నాడనీ గాథ. దానినే సాకుగా తీసుకుని ఢిల్లీశ్వరుడు 1686 సంవత్సరములో తన బలాలను మోజంసుభాన్ జహాన్ అను సైన్యాధీశునితో గొలకొండకు పంపించాడు. వారి నెదుర్కొడానికి గోలకొండ నుండి మహమ్మద్ ఇబ్రహీం వెళ్ళాడు. అయితే, అక్కన్న, మాదన్నలమీది కోపమువల్ల అతడు శత్రువులతో కలసిపోయాడు. మొగలు సైన్యములు హైదరాబాదు నగరమును దోచుకొని అనేకమందిని చంపివేసినవి. తానీషా భయపడి గొలకొండ దుర్గ ద్వారము మూయించాడు. ఇదియిట్లు జరుగుతుండగా, అంతఃపుర స్త్రీలు కొందరు దుండగీండ్రను అక్కన్న మాదన్నలను జంపడానికి నియోగించారు. అదను కనిపెట్టి, వారు దివాణమునుంచి వెళ్ళుతుండగా శిరచ్ఛేదము చేసి మోజంకు బహూకరించారు. ఇది తెలిసి తానీషా చాల విచారము నొంది, తనకు సహాయము చేయువారు లేక, కొన్ని కోట్ల రూపాయలు ఇచ్చి మొగలులతో సంధి చేసుకున్నాడు. ఇది చారిత్రక గాథ.

శివగంగకు సమీపములోనే ఒక హనుమంతుని దేవాలయమున్నది. అందలి విగ్రహమును ఒక మహమ్మదీయుడు నాశనముచేయబూని నెత్తురు కక్కుకుని చచ్చాడనీ, ఆ సమీపముననే అతడిని పాతిపెట్టారనీ కూడా అంటారు. ఈ దేవాలయములో నిప్పటికి పూజా పునస్కారములు జరుగుతున్నవి.

హనుమద్దేవాలయ సమీపమున విష్ణుగంగ అనే దిగుడుబావి (చిన్న కోనేరు) రెండు అంతస్తుల చుట్టు మండపముతో వున్నది. ఇది స్త్రీలు స్నానము చేయడానికీ పైభాగమున బట్టలు ఆరవేసుకోడానికీ, అనుకూలముగానున్నది. రెండువందల సంవత్సరములైనను, కట్టడములు చక్కగా నుండి, కొద్దిపాటి మరమ్మతుతో బాగగు స్థితిలో నున్నవి. గోలకొండ దుర్గములో అక్కన్న మాదన్నలు చంపబడిరని తెలియగానే, అక్కడి స్త్రీలు తమ వెండి, బంగారు వస్తువులు బావిలో పడవైచి, ఈ విష్ణుగంగలో పడి చనిపోయినారని అంటారు.

ఈ విష్ణుగంగ ఎదుట ఒక మిట్ట వున్నది. అచ్చటచ్చట సున్నపు పునాదులు కనబడుతున్నవి. అక్కన్న, మాదన్న గృహములు

(48 వ పేజీ చూడండి)

# దివి నుండి భువికి



## కొండముది హనుమంతరావు

1967 అక్టోబరు 30—

గోడమీద మేకుకు వేలాడుతున్న కాలెండరు తారీఖు చూపిస్తున్నది.

ఏడు గంటలు—

గోడ గడియారం కాలాన్ని నిర్ణయిస్తున్నది.

సంధ్య రేడియో ట్యూన్ చేసింది.

"ఆలిండియా రేడియో వార్తలు. చదువుతున్నది . 1962 లో విశ్వాంతరాళంలోకి ప్రథమంగా ఎగిరిన శాస్త్రజ్ఞుల జట్టు హిందూదేశపు కాలమానం ప్రకారం ఇవ్వాళ ఉదయం ఎనిమిది గంటలకు మాస్కో చేరుతుందని మాస్కో రేడియో నేడు ప్రకటించింది. ఈ జట్టు అంతరిక్షంలో తిరుగుతూ మొదట ఒక సంవత్సరంపాటు సంకేతాలు పంపుతూనే ఉన్నది. ఆ తర్వాత అది కన్పించటమే కాని సంకేతాలు పంపించకపోవటంతో ఉపగ్రహంలోని శాస్త్రజ్ఞుల సజీవత్వం అనుమానించబడింది. కాని నేడు ఆ శాస్త్రజ్ఞులే అందుకు కారణం వివరించారు. వారి రేడియోలు, టెలివిజన్లు, ట్రాన్స్మిటర్లు, ఆఖరుకు ఉపగ్రహాన్ని నడిపే ఇంజనూ— అన్నీ ఉన్నట్టుండి ఒక్కసారి పనిచేయటం మానేశాయిట. ఆ చెడిపోయిన వాటి నన్నింటినీ నేటికి వారు బాగుచేయ కలిగినట్లు, భూమిమీదికి దిగివస్తున్నట్లు వార్తలు అందించారు. ఈ వార్త విని మాస్కో శాస్త్రజ్ఞులూ, ప్రజలూ ఆశ్చర్యానందాలతో వారి రాకకై ఎదురు చూస్తున్నారు.."

ఈ వార్త విన్న సంధ్య కుప్పలా కూలిపోయింది. ఆమె హృదయం వేయి వ్రక్కలయింది.

గతం రేవులో కాలుజారి కాలప్రవాహంలో పడి కొట్టుకుపోతున్న సంధ్యను గతకాలపు సంఘటనలూ, సంస్కృతులూ జలగల్లా పట్టుకుని బాధించటం మొదలు పెట్టినయ్ ..

*   *   *

అప్పుడు తనకు పదిహేనవ సంవత్సరం; బావకు పద్దెనిమిదవ సంవత్సరం. తను ఇంటర్ సీనియర్ క్లాసు చదువుతున్నది; బావ ఫిజిక్సానర్స్ ఫైనలియర్ చదువుతున్నాడు.

ఆ సంవత్సరంలో అక్టోబరు 5 వ తేదిన— అంటే ఇప్పటికి పదేళ్ళ క్రితం అన్నమాట— రష్యా శాస్త్రజ్ఞులు మొదటిసారిగా ఉపగ్రహాన్ని విజయవంతంగా ఆకాశంలోకి పంపించగల్గారు.

ఈ వార్తను రేడియో వెంటనే ప్రకటించింది; పత్రికలు పతాక శీర్షికలతో విపులంగా వివరించినయ్, ఏ పేపర్లో చూసినా ఆ ఉపగ్రహం తాలూకు వివరాలే.

అది 23 అంగుళాల వ్యాసంకల్గినగోళము. దాని బరువు 183 పౌనులు. మూడు అంచెల రాకెట్ల ద్వారా దానిని అంతరిక్షంలోకి విసిరివేశారు. సెకనుకు ఐదుమైళ్ళ వేగంతో భూమికి 560 మైళ్ల ఎత్తున అది భూమిచుట్టూ తిరుగుతున్నది భూమిని ఒకసారి చుట్టిరావటానికి 95 నిమిషాలు పట్టున్నది.

సరే అదంతా బాగానే ఉంది. కాని అసలు అది ఆకాశంలో క్రింద పడకుండా ఎలా నిలవకల్గుతున్నది? – అనే సందేహం కల్గింది. భూమికి ఆకర్షణశక్తి ఉందని పైనుంచి ఏదయినా వస్తువు క్రింద బడటానికి కారణం ఆ శక్తేనని—తను ఫిజిక్స్‌లో చదువుకుంది. మరి.. ?

బావ నడిగింది

బావ నవ్వాడు తన అమాయకతకు కాబోలు! తన తెలివితక్కువ సందేహాన్ని చూసి కాబోలు బావ నవ్వాడు. నవ్వి సందేహ నివృత్తి చేశాడు.

చివరి రాకెట్ కొంత ఆర్బిటల్ వెలాసిటీతో ఉపగ్రహాన్ని విసిరింది. ఉపగ్రహం తాలూకు సెంట్రిఫ్యూగల్ ఫోర్స్ భూమ్యాకర్షణ శక్తిని బాలన్స్ చేస్తున్నది ఆ రెండు శక్తులూ బాలన్స్ అవుతున్నంతకాలం ఉపగ్రహం క్రిందకు పడదు

అయితే - ఎంతకాలం అది అలా అంతరిక్షంలో ప్రదక్షిణం చేస్తూ ఉంటుంది?- అనేది రెండో సందేహం

అదిరష్యాశాస్త్రజ్ఞులే చెప్పలేకపోయారు. ఉపగ్రహం తాలూకు వేగం గాలిలోని ఘనపదార్థాల అవరోధాలవల్ల కొన్నాళ్ళకు తగ్గుతుందని అలా క్రమక్రమంగా తగుతూ క్రిందికి దిగుతూ వాతావరణపు దళసరి పొరల చేరి, పొరల రాపిడికి ఉష్ణము జనిస్తుందని ఆ ఉష్ణానికి అది కాలి రాలిపోతుందని చెప్పారు.

(కాని కాలము దాని ఆయుర్దాయాన్ని నిర్ణయం చేసింది)

ఇదిరష్యా శాస్త్రజ్ఞుల సాంకేతిక విజ్ఞానాన్ని నిరూపిస్తున్నది - అని బావ అంటే ఉపగ్రహం నిర్మించగానే కాదు "ఆత్మనిగ్రహం" సాధించాలిగాని, లేకపోతే మనిషికి ముక్తి ఎక్కడ-అని తాతయ్య పెదవి విరిచేవాడు!

తర్వాత తర్వాత కోతుల్ని, చిన్న చిన్న జంతువుల్ని పంపించారు వాటితోపాటే టెలీ - ఫోటో కెమెరాలు టెలివిజనూ, రేడియో ట్రాన్స్మిటర్లూ ఉపగ్రహంలో ఉంచారు. జంతువులు బ్రతికినయ్.

ఒక్కొక ఏడాది గడుస్తున్న కొద్దీ ఒక్కొక్క మెట్టే అధిరోహిస్తున్నారు శాస్త్రజ్ఞులు.

తను ఇంటర్ ప్యాసయింది; బావ ఫస్ట్ క్లాస్‌లో ఆనర్స్ ప్యాసయాడు.

అమ్మ-నాన్నా సావకాశం పెళ్ళిమాట ఎత్తారు

"తొందరేమొచ్చింది మామయ్యా! రిసెర్చి చేయాలని ఉంది నాకు సంధ్యను కూడా ఆనర్స్‌లో చేర్పిస్తే సరి!"

బావ మాటను కాదనలేకపోయారు అమ్మా-నాన్నా

తను ఆనర్స్‌లో చేరింది; బావ రిసెర్చి చేస్తున్నాడు

నాలుగేళ్ళు ఇట్టె గడిచిపోయినయ్.

రష్యా శాస్త్రజ్ఞులు అంతరిక్షంలోకి మనుష్యుల్నే పంపించే శాస్త్రవిజ్ఞానాన్ని సాధించగలారు

తను ఎమ్ ఎస్‌సి. డిగ్రీ పొందటం, బావ కాస్మిక్ రేస్‌లో రిసెర్చిచేసి డాక్టరేట్ సంపాదించటం-ఒక్క సంవత్సరంలో జరిగినయ్.

"ఇరవయ్యోఏడు కూడా వచ్చింది...ఇంకెప్పుడండీ అమ్మాయి పెళ్లి చేయటం?"

అమ్మ నాన్నను హెచ్చరించింది.

మంచిరోజు చూసి నాన్న మామయ్యని అడిగాడు బావఇష్టం అన్నాడు మామయ్య. బావ అంగీకారం చూపించాడు. 'తథాస్తు' అన్నారు పెద్దలు. తాంబూలాలు పుచ్చుకున్నారు.

తనమనసు దివ్యలోకాలకు పయనించింది; తన హృదయం నవ్యానుభూతి పొందింది; తన శరీరం మధురభావంతో పులకరించింది.

ఆ సాయంత్రం—సముద్రతీరంలో...

బావా తనూ కూర్చుని.. ఎన్నో కబుర్లు .. ఏవేవో ఆలోచనలు.. భావిజీవితపు ఊహలు...

చీకటి పడేవేళకు ఇంటికి వచ్చేసరికి ఇండియా ప్రభుత్వం పంపించిన ఆహ్వానం—

రష్యాప్రభుత్వం అయిదుగురు శాస్త్రజ్ఞులని మొదటిసారిగా విశ్వాంతరాళంలోకి పంపించటానికి నిర్ణయించింది నెహ్రూగారిమీద గౌరవంతోనూ, హిందూదేశం మీదగల అభిమానంతోనూ భారతీయ శాస్త్రజ్ఞుడిని ఒకరిని పంపించటానికి అవకాశం కల్పిస్తున్నది రష్యాప్రభుత్వం. కాస్మిక్ రేస్‌లో అత్యద్భుతమైన పరిశోధన కావించిన భాస్కరాన్ని ఇండియాప్రభుత్వం ఆ అవకాశాన్ని ఉపయోగించుకోమని ఆహ్వానిస్తున్నది

భాస్కరం బావ సంతోషానికి అంతు లేదు ఆనాడు

అమ్మ నాన్నల విచారం ఇంతని చెప్పలేము

అత్తయ్యా మామయ్యా ఎంత విచారించారో ఆ పరమాత్ముడికే ఎఱుక.

తనకూ భయంగానే ఉంది—ప్రథమ ప్రయత్నం గాలీ, నీరూ, ఆహారమూ తమతోపాటే తీసికెళ్తారుట అయినా మటుకు మనం అనుకున్నట్లు అన్నీ జరుగుతాయని నమ్మక మేమిటి—అని అనిపించినా ఒక పక్కన సంతోషంగానే ఉంది. మొదటిసారిగా అంతరిక్షంలోకి ఎగరబోతున్న అయిగురు శాస్త్రజ్ఞులలో భాస్కరం బావ ఒకడు!

కాని—

అమ్మ-నాన్నా వద్దని చెప్పి చూశారు. అత్తయ్యా, మామయ్యా 'వద్దు వద్దు' అని బ్రతిమిలాడారు బావ వారిమాట వినలేదు. తనని చెప్పిచూడమన్నారు అమ్మ నాన్నా. తనేం చెప్తుంది? మానుకోమని ఎలా చెప్పగలదు??

ప్రపంచం ఇస్తున్న గౌరవమూ, గొప్పతనమూ ముందు తనలాంటి సామాన్యస్త్రీ అర్పించే ప్రేమా అభిమానాలు ఎంత? స్వతహాగా బావ ఎడ్వంచరస్ స్పిరిట్ కలవాడు అంతేకాక తను చేయదలచుకున్నది చేసి తీఱుతాడు. తనూ అంతే! తనకీ అలాంటి అవకాశం లభించాక గాని ..

పక్కకి పిలిచి అత్తయ్య అన్నది

"అమ్మాయ్ సంధ్యా! నువ్వుచెప్పమ్మా నీమాట కాదనడు వాడు"

చేతులు పట్టుకుని "ఇవి చేతులు కావు కాళ్ళనుకో" మన్నది అత్తయ్య. తనేమీ మాట్లాడలేకపోయింది. అత్తయ్య మొహం చూస్తే జాలికలుగుతున్నది. ఆమె కళ్ళు నీటి కుండలయినయ్.

"నాకు పుత్రభిక్ష పెట్టమ్మా!"

అత్తయ్యకు బావ ఒక్కడే కొడుకు. కూతుళ్లుకూడా లేరు.

"అత్తయ్యా! .."

"నువ్వు మావంశాన్ని నిలబెట్టాలమ్మా. చచ్చి నీకడుపున పుట్టాను"

అత్తయ్యమాట కాదనలేక పోయింది. గదిలోకి పోయిచూస్తే అప్పుడే బట్టలు సర్దుకుంటున్నాడు బావ

"బావా!"

ఏమిటూ అన్నట్లుగా వెనకకి తిరిగి చూశాడు బావ.

తీరా బావ మొహంలోని ఉత్సాహం, సంతోషం చూసుంటే అత్తయ్య చెప్పమన్నది చెప్పటానికి నోరు రాలేదు. కాని బావ గ్రహించాడు - తన మనసులోని విషయం.

#  దివి నుండి భువికి 

"ఎందుకు సంధ్యా! చదువుకున్న దానివి అన్నీ తెలిసిన దానివి. నువ్వే అలా బెంబేలు పడిపోతావేం?"

తన కోసమూ బావనర్థిస్తున్నది; అత్తయ్య బాధ చూడలేక గాని.

"సంతోషంగా సాగనంపు సంధ్యా! బాలచంద్రుడిని చూడూ!-మాంచాల ఎంత ధైర్యంగా సంతోషంగా పంపిందో?"

బావ మాటలు వినేసరికి తనలో ఏదో ఒక విధమైన ధైర్యమూ, స్థైర్యమూ వచ్చినయ్. అత్తయ్య కంటతడిగాని, గదద కంఠం గాని తనని బలహీన పరచలేక పోయినయ్-ఇక.

"లేదు బావా! శుభంగాపోయి లాభంగా రా!"

"అది అట్లా ఉండాలి. ఏదీ నవ్వు "

తను నవ్వింది-హృదయ పూర్వకంగా. బావ శ్రుతికల్పాడు.

"ఎంతచెప్పు. ఒక్క ఏడాది అంటే ఏడాది. ఏడాది ఎంతలో వస్తుంది. గిర్రున తిరిగిరాదూ-మనం చూస్తూ ఉండగానే"

బావ తనకు చెప్పిన ధైర్యపుమాటలే తను అమ్మ - నాన్నకూ, అత్తయ్యా మామయ్యకూ చెప్పింది.

తను ఇంతమందికీ ధైర్యం చెప్పిందేకాని, తీరా బావ విమానం ఎక్కుతుంటే తనకళ్ళు కన్నీటి కుండలయినయ్ ఎక్కి చేయి ఊపుతుంటే తనగుండెలు బరువెక్కినయ్

బావవెళ్ళిన నాల్గోరోజుకి రేడియోలో చెప్పారు రష్యప్రభుత్వం ప్రథమంగా శాస్త్రజ్ఞులని ఆకాశంలోకి విజయవంతంగా పంపించగల్గిందీ అని.



తి విజయం తనకే ననిపించింది.

ఏడాదిపాటు అది కన్పిస్తూనే ఉన్నది, శాస్త్రజ్ఞులు పంపించే సంకేతాలు వినిపిస్తూనే ఉన్నయ్. కాని ఒకరోజున విన్పించలేదు. అమెరికా రేడియో ఆ ఉపగ్రహంలోని శాస్త్రజ్ఞులు బహుశా చనిపోయి ఉంటారని అందుకనే విన్పించటం లేదని అన్నారు. "కాదు రేడియో ట్రాన్స్మిటరు పనిచేయటం మానేసి ఉంటయ్" అని వ్యాఖ్యానించింది మాస్కో రేడియో. "ట్రాన్స్మిటర్లు చెడిపోతే శాస్త్రజ్ఞులు ఆమాత్రం బాగు చేసుకోలేరా?" అని ఎదురుప్రశ్న వేసింది అమెరికా రేడియో!

దానికి తగ్గటుగానే ఏడాదిలో తిరిగి రావాలని పథకం వేసుకువెళ్ళినవారు ఏడ్నర్థమయినా తిరిగిరాలేదు

గదిలో తలుపులు బిగించుకుని ఒంటరిగా ఎన్నిసార్లు ఏడ్చిందో...ఎంతమంది దేవుళ్ళను ఎంతగా బ్రతిమిలాడుకుందో. .

రష్య శాస్త్రజ్ఞులు మళ్ళీ జంతువులని పంపించడం మొదలుపెట్టారు.

తన హృదయం దహించుకుపోతున్నది. పగలు ఏపనీ చేయడానికి తోచదు రాత్రిళ్లు నిద్రపట్టదు. మంచంమీదనుంచిలేచి పెరట్లోకి పోతుంది తనతోపాటే అమ్మకూడా లేస్తుంది.

"మంచులో తిరగటం మంచిదికాదమ్మా! వచ్చి పడుకో!"

ఇంట్లోకివచ్చి పడుకుంటుంది కాని నిద్రపట్టేగా!

రోజుకు పదిపేపర్లు చూస్తుంది; రోజుకు ఆరుసార్లు రేడియోవార్తలు వింటుంది కాని ఒక్కపేపరూ రాయదు; ఒక్కసారయినా రేడియో చెప్పదు—బావ వస్తున్నట్లు కాకపోయినా బ్రతికిఉన్నట్లయినా.

రోజు యుగంగా గడుస్తున్నది .

రాధపెళ్ళి నిశ్చయమైనట్లు బాబాయిదగ్గఱనుండి ఉత్తరం వచ్చినరోజున మాటల సందర్భంలో నాన్న అన్నాడు

"ఇంకా వాడికోసం ఎన్నాళ్ళని కనిపెట్టుకు కూర్చుంటాం! నామాటవిను తల్లీ!"

ఆ మాట వినగానే తనగుండె చెఱువై పోయింది

"కాదు నాన్నా! బావ వస్తాడు ఉపగ్రహం కన్పిస్తూనే ఉందిగా, విన్పించక పోయినా."

తన ఆశ చావదు. విజ్ఞానంమీద తనకున్న విశ్వాసం నశించదు

ఆనాటినుండి రోజు కొకసారైనా నాన్న హెచ్చరిస్తూంటాడు

ఇంట్లో ఈ మాటలు వినలేక అత్తయ్య గారింటికి పోతుంది. తను అన్నాహారాలు మానటంతో చిక్కి శల్యమై పోయినా అత్తయ్య తననిచూసి జాలి పడుతుంది.

"నిన్ను ఉసురుపెట్టున్నానమ్మా! ఏచావు చస్తానో గాని."

అత్తయ్య మాటలు తన హృదయాన్ని రంపపుకోత కోస్తయ్

బావ తనకన్న ఆమె కెక్కువ. ఒక్కగా నొక్క బిడ. కంటికి కన్పించకుండా పోయాడు ఆనాడు బావను తను బ్రతిమిలాడి నట్లయితే ఈనాడు అత్తయ్యకు పుత్రశోకం ఉండేది కాదుగా.

"నేనే తప్పు చేశాను అత్తయ్యా! నా తప్పుకు శిక్ష నేనేగాక మీరుకూడా అనుభవించాల్సి వస్తున్నది."

అత్తయ్య భోరుమని ఏడుస్తుంది.

తను మనశ్శాంతి పోగొట్టుకోవటం కాక అత్తయ్యక్కూడా లేకుండా చేస్తుంది. కాని తనేం చేస్తుంది మరి?

* * *

"అమ్మాయ్! సంధ్యా! యీ వార్త విన్నావూ?"

వర్తమానం రేవు చేరకముందే సంధ్య తండ్రి కాలప్రవాహంలో పడి కొట్టుకుపోతున్న సంధ్యను రెక్కపట్టుకు ఒడ్డుకు చేర్చాడు.

తండ్రి కేకకు సంధ్య త్రుళ్ళిపడింది

"ఏమిటి నాన్నా?"

సంధ్య ఏడింటికి రేడియోలో విన్న వార్తే చెప్పాడు—తండ్రి

"ఆఁ! విన్నాను నాన్నా—" అన్నది సంధ్య చాలా నిరుత్సాహంతో.

ఇంట్లో పని చేస్తుకుంటున్న సంధ్య తల్లి ఒక్కసారి అక్కడికి వచ్చింది—

"ఏమిటి! ఎవరూ వచ్చేది? మన భాస్కరమేనా?"

విహ్వలమూ, విషణ్ణమూ అయిన సంధ్య మొహం చూసేసరికి ఆమె హృదయంలో ఉత్పన్నమైన ఆనంద తరంగాలు అంతలోనే విరిగిపోయినయ్ కళకళలాడుతున్న మొహం కాస్తా కళావిహీనమై పోయింది

"ఆఁ! అవునే మన భా "

భార్య మొహం చూసేసరికి సంధ్యతండ్రి మొహంకూడా విషణ్ణమైంది

సంధ్య దుఃఖం ముంచుకురాగా గదిలోకి పోయి పడుకుంది.

మనసు స్తిమితమయిందికాదు

బావమొహం ఎలా చూడటం?

బావ తనను గురించి ఏమనుకుంటాడు?

సతమతమయి పోతున్నది సంధ్య. కాలుగాలిన పిల్లిలా ఇల్లంతా కలియ తిరుగుతున్నది అత్తయ్యగారింటికి పోదామంటే

అసలే మొహం చెల్లటం లేదు. అసలు అత్తయ్యని చూసే నెలరోజులయింది. ఇవ్వాళ ఏమని వాళ్ళింటికి పోతుంది?

అన్నం సయించింది కాదు

ఆలోచిస్తూనే చిన్న కునుకు తీసింది.

నిద్రలేచేసరికి మూడుగంటలయింది. అత్తయ్య వచ్చిపోయిందిట. అమ్మ చెప్పింది. సాయంత్రం నాలుగింటికి విమానాశ్రయానికి రావటానికి సిద్ధంగా ఉండమని చెప్పి పోయిందిట.

"నేను పోనే అమ్మా!"

"అలా అంటే బాగుండదమ్మా! అత్తయ్య ఏమన్నా అనుకుంటుంది. బావ బాధపడతాడు"

సంధ్యకు ఏడుపు వచ్చింది. అసలు బావకు మొహం చూపించటమే ఎలా అని తను బాధపడుతుంటే, బావ బాధపడుతాడని ఏ మొహం పెట్టుకుని తను విమానాశ్రయం వెళ్తుంది?

అన్నట్లుగా అత్తయ్య నాలుగింటికల్లా వచ్చేసింది. తన బాధంతా చెప్పుకుంది సంధ్య. తనని బ్రతిమిలాడ వద్దన్నది. తనని వదిలి పెట్టమని బ్రతిమలాడుకుంది.

"ఇంటికివస్తే చూస్తాగా?"

మనసులో రాకుండా ఉంటే బాగుండును అని ఉన్నది కాని బావని చూడాలని మనసు పీకుతున్నది. ఈ అయిదేళ్ళు ఎందుకని మౌనంగా ఉన్నారో? ఒక్క ఏడాదిలో వస్తానన్న వాళ్ళు అయిదేళ్ళు ఎందుకుండాల్సి వచ్చిందో? తెల్సుకోవాలని చాలా ఆదుర్దాగా ఉంది కాని కాని ..

సూర్యాస్తమయమయి సంధ్యాకాంతులు ప్రకాశిస్తున్నయ్.

టాక్సీవచ్చి వాకిట్లో ఆగింది.

సంధ్యగుండె ఆగినంత పనయింది. మామయ్యా-నాన్నా వరండాలో కూర్చున్నారు వంటింట్లో ఉన్న అమ్మ దగ్గఱకు కాబోలు అత్తయ్య లోపలికి పోయింది.

సంధ్య కిటికీ దగ్గఱ నిల్చుని చూస్తున్నది భాస్కరంబావ అడుగుతున్నాడు.

"సంధ్య ఏది మామయ్యా! కన్పించదేం?"

"గదిలో ఉన్నట్లుంది చూడు"

సంధ్యకు అమితమైన భయం కల్గింది. బావ వస్తున్నాడు. ఎలా? ఎలా? తెల్లబడ్డాడు దేహంలో ఏదో ఒకవిధమైన కాంతి కన్పిస్తున్నది మొహం చాలా స్వచ్ఛంగా, సుందరంగా ఉంది; పెదవుల మీద నవ్వు స్నిగ్ధంగా తెల్లగా మెరుస్తున్నది- ఇక్కడినించి వెళ్ళే నాటిలాగా! కాని తనలో-ఈ అయిదేళ్ళు ఎంతో మార్పు తెచ్చినయ్. బుగ్గలు పీక్కుపోయినయ్. మొహంలో మునపటి కాంతి లేదు.

బావ మొహం చూస్తుంటే ఎవరూ తన విషయం చెప్పినట్లు లేదు.



బెజవాడ కనకదుర్గాలయ గోపురం

ఫోటో: ఆర్. సుబ్రహ్మణ్యం, గుంటకల్.

"ఏం సంధ్యా! నామీద కోపంవచ్చిందా అంత నల్లపూసవయి పోయావు"

బావమీద తనకు కోపమా?-ఎనలేని బాధతో కుంచించుకు పోతున్నది గాని.

అంతలోనే ఏదో భావం తళుక్కుమని మెరిసి సంధ్యకు సిగ్గు ముంచుకు వచ్చింది. పమిట చెంగు నిండా కప్పుకుని తలవంచుకు నిల్చున్నది సంధ్య.

"చాలా పెద్దమనిషివయి పోయావే? అవున్లే అది నీ తప్పుకాదు భూమిమీద ఉండటంతో అయిదేళ్ళు పెరిగిపోయావు. కాని నేనుంది చూశావూ పైన ఆకాశంలో తిరుగుతూ ఉంపటంతో ఒక్కఏడాదే పెరిగాను. అబద్ధమను కుంటున్నావా సంధ్యా నే చెప్పేది. ఈ విషయం మాకయినా నూస్కోలో దిగేదాకా తెలియదు. ఐన్‌స్టీన్ సాపేక్ష సిద్ధాంతం నిజమేనని ఋజువయింది 'టైమ్స్' అనేది 'యబ్సల్యూట్ టరమ్' కాదని ఇక అందరూ ఒప్పుకోవాల్సిందే ఏమిటీ అలా తలవంచుకు నిల్చున్నావు. సంధ్యా!"

ఆ పిలుపులో అదే మార్దవం—అదే మాధుర్యం. మనసు సుళ్ళు తిరిగిపోయింది.

తరంగితమైన ప్రేమతోనా? తట్టుకోలేని బాధతోనా? సంధ్య తలెత్తి చూసింది.

బావ తనమాట నిలబెట్టుకున్నాడన్న మాట. బావ లెక్క ప్రకారం ఏడాదిలోనే తిరిగి వచ్చాడు! దివినుండి భువికి దిగివచ్చిన దేముడిలాగా కన్పించాడు.

"చీకట్లో ఉన్నావేం? లైటయినా వేసుకోకుండా?"

లైటు వేశాడు భాస్కరం.

పల్చని జార్జెట్ సిల్కులోంచి సంధ్య మెళ్ళోని మంగళసూత్రం తళుక్కు మంది. భాస్కరం కళ్ళు గిరగిరాతిరిగినయ్. కాళ్ళు పట్టుతప్పినయ్. "నన్ను క్షమించు బావా! మొన్ననే పదహారురోజుల పండుగ" అని సంధ్య గబగబా తన గదిలోకి వెళ్ళి తలుపులు బిగించుకుంది. 

# మూఢనమ్మకాలు

“మహాలక్ష్మి! ఇంట్లో కాలు పెట్టింది లగాయతు అన్నీ మంట బెడుతూంది. తల్లి! ఏముహూర్తాన యింట్లో పాదం పెట్టిందోగాని అన్నీ నష్టాలే! ఛీ. ఛీ ఎక్కడ దాపురించిందమ్మా యీ యేలినాటి శని... లేకపోతే ఎక్కడా ఒక్క సంవత్సరమైనా తప్పకుండా భేషుగ్గా చదివి మెట్రిక్ వరకు ప్యాసయ్యాడు వస్తాడు. అలాంటిది ఈవిడగారు యింట్లో కాలు పెట్టిందీ లేదు అబ్బాయి చదువు అటకెక్కింది”

“అదేవిటమ్మా! అన్నయ్య సరిగ్గా కాలేజీకి వెళ్లక నాటకాల్లో తిరిగి పరీక్ష పోగొట్టుకున్నాడుగాని వదిన వాణ్ణేమైనా చదవద్దందా” అని కొత్త చదువుకొన్న కూతురు రాజ్యం వదినగారైన కాంతాన్ని వెనకేసుకు వచ్చింది

“అబ్బో వదినెగార్ని వెనకేసుకు వస్తున్నావే! అదిసరే చదవక మీ అన్నయ్య పరీక్ష పోయిందన్నావ్! బాగుంది. కాని నిక్షేపంలాంటి పన్నెండెకరాల మాగాణి, సంవత్సరానికి ఆరు ఏడు గరిసెలు అంబారీ వచ్చేది. అలాంటి బంగారంలాంటి భూమి యీవిడగారు యింట్లో కాలుపెట్టిం తర్వాతనేగా యిట్టే చూస్తుండగానే రైతుల పరమయింది,” అని సుందరమ్మగారు కోడలు కాంతంమీద తనకుగల అక్కసు వెళ్లబోస్తూ తనవాదనను ఎలాగైనా బలపర్చ. కోవాలనే కాంతంతో అంది తల్లియొక్క తెలివితక్కువ తనానికి నవ్వాలో, ఏడ్వాలో, అర్థంకాలేదు రాజ్యానికి. “దున్నేవాడిదే భూమి అని

## శ్రీ వీటూరి

ప్రభుత్వం పెట్టిన చట్టంప్రకారం అందరి భూములకు మల్లే మనభూమీ పోయింది. అంతేగాని ఇందులో కాంతంచేసిన తప్పేమిటమ్మా” అని రాజ్యం సమాధానంకోసం నిరీక్షిస్తున్న తల్లితో అంది.

కూతురు చెప్పిన సమాధానం తనకు నచ్చలేదన్నట్లు సుందరమ్మగారు ఒక్కసారి మూతి విరుచుకొంది.

తల్లితత్వానికి ఆశ్చర్యపోతూ పైటచెంగు అడ్డు పెటుకొని నవ్వుకొంది రాజ్యం!

“అవునమ్మా! మాలాంటివాళ్లి మాటలు మీకు నవ్వుతాగానే వుంటాయ్! ఇంతకూ నిన్న నవలసిన తప్పు లేదులే! ఆవిడగారు యింట్లో కాలుపెట్టింది లగాయతు.. . ”

“ఊరుకోవమ్మా! ఎవరైనా వింటే నవ్విపోతారు, ఎందుకస్తమానం వదిన నలా ఆడిపోసుకొంటావ్. ఆవిడ వింటే ఎంత బాధపడుతుందో ఆలోచించావా” అధికారం చెలాయించడాని కన్నా కూడా హద్దూ పద్దూ వుండాలి” అని రాజ్యం గదిలోనికి వెళ్ళిపోయింది.

శ్రోతలు లేకపోయినా సుందరమ్మగారి రేడియో సేషన్ యింకా పలుకుతూనే వుంది, పెరట్లో కూరగాయలు తరుగుతూన్న కాంతం అత్తగారు పెడ్తూన్న చీవాటూ దీవనలు వింటూవుంది ఇలాంటివి ఆమెకం కొత్తగాదు “నిత్యం చచ్చేవాడికి ఏడ్చేవాడెవడని” కొత్తలో కొంచం బాధపడ్డా క్రమేణా అత్తగారి సాధింపులకు అలవాటు పడిపోయింది. కాపురాని కొచ్చిన తరువాత కొంతకాలంవరకూ ఆమెకు అత్తగారి మనస్తత్వం అర్థంకాలేదు

పెళ్లిలో తన వాళ్ళేమైనా లోటుచేశారేమోనని కొన్నాళ్ల వరకూ అనుకొంది కాని నిరుడు పండక్కి వెళ్ళినపుడు అలాంటిదేమీ జరగలేదని తల్లిద్వారా తెలిసికొంది. మరి తనంటే అత్తగారికింత అలుసెందుకో అర్థమవలేదు కాంతానికి పోనీ తనేమైనా తప్పుగా సంచరిస్తోందా అంటే అలాంటిదేమీ తన ఆత్మకు అనిసంత వరకూ లేదు ఆ విషయంలో తన అత్తగారు కూడా తనతో ఏకీభవిస్తుంది “చదువుకొందన్నమాటేగాని ఈకాలపు ఆడపిల్లలా కాదమ్మా మాకోడలు, చాలా వినయంగా వుంటుంది”అని అత్తగారు పొరుగింటి శేషమ్మగారితో అనడం తను చాటుగా విన్నదాయె! మరి రూపంలో తనేమైనా కురూపిగా వుందా అంటే “అందంలో అంజలికూడా నీ ముందు బలాదూర్” అంటూ వెనకటికి తన కాసులో కుర్రాళ్ళు తన్ను పొగుడుతూ వుత్తరాలు వ్రాసి వెనకాల వెంటబడి తన తండ్రిచేత చీవాటు తిన్న రోజులున్నాయ్! కాక పోయినా “ఆడదానికి అందమెందుకు? కొరుక్కు తింటామా ఏంటి?”అని అందాన్ని విమర్శించే వారిలో తన అత్తగారు ప్రథము

రాలారు! ఇంక తన విషయంలో అత్తగారికింత అసంతృప్తి, అసహ్యం ఎందుక్కలిగాయో అర్థం కాలేదు కాంతానికి. తనేం తెలివి తక్కువదా అంటే తన తెలివితేటలకి కొలబద్దగా మదరాస్ యూనివర్శిటీ స్కూల్ ఫైనల్లో సర్టిఫికేట్ ప్రసాదించిందాయె! పోనీ తనకేవైనా పనిపాట్లు చేతకావా అంటే "ఆడదై పుట్టిం తర్వాత వంటా పెంటా చేతనవాలి"; అని అమ్మ నాన్న గారితో ప్రతిపక్షంగా నిలబడి వాదించి సెలవు రోజుల్లో కూడా తనచేత యింటిపనులు చేయించేది. తను కాపురానికొచ్చిన మూడు మాసాలకే విరిగిపోయిన కళ్ళద్దాలు బాగుచేయించుకొని; క్రొత్తగా ఒక వ్యాస పీఠం కొడుకుచేత తెప్పించుకొని స్పెషల్ గా రెండుతుంగచాపలు ఆర్డరిచ్చి తెప్పించుకొని, స్థానికంగా వుంటూ తనకు సమకాలికురాండ్రైన గంగా భాగీరథీ సమానురాండ్రను రప్పించుకొని రోజూ పురాణ కాలక్షేపం జరుపుతూంది అత్తగారు.

ఇంక పొదుపు విషయంలో "నీ దగ్గిర మన ఆర్థిక మంత్రులంతా కొన్నాళ్ళు పాఠాలు నేర్చుకొంటే బాగుణ్ను మన దేశం బాగుపడేది" అని ఆయన ఆక్షేపణలేని సర్టిఫికేట్ ప్రసాదించారాయె! ఇంక తనలో ఏం లోటు వుందని? అత్తగారు తనని దూషించడంలో గల ఆంతర్యం అర్థం కాలేదు కాంతానికి. ఆడబడుచు వచ్చి నాలుగు రోజులయింది. కాస్త చదువుకొన్నామె గాబట్టి తల్లిని మందలిస్తూ వుంటుంది. లేకపోతే ఆమెను అనేవారుగాని, ఆపేవారుగాని ఆయింట్లో ఎవరూ లేరు. ఆయన వున్నారంటే అహర్నిశలూ ఆఫీసు, రికార్డుతప్ప యింకో సంగతే ఆయన పట్టించుకోరు.

కాంతం కాపురానికి వచ్చిన నాలుగు మాసాలకు, ఆయింట్లో అనాదిగా వుంటూన్న ఒక ఆవు అకస్మాత్తుగా చచ్చిపోయింది. "అయ్యోర్రామా! కామధేనువులాంటి ఆవురా బాబూ! మా యింటి మహాలక్ష్మిరా బాబూ! ఈ మరిడమ్మ యింట్లో కాలుపెట్టింది, ఆ ఆవుని పొటనెట్టేసుకొందని" మూడురోజుల వరకూ, కోడల్ని విడవకుండా తిడుతూ, పరామర్శ చేయడానికి వచ్చే పొరుగింటి అమ్మలక్కలతో ఆ ఆవుతాలూకు పూర్వజన్మ వృత్తాంతం చెపుతూ; దాని పాడి; దాని అందం; దాని మహిమ ఏకరువు పెడ్తూ యింట్లో పీనుగపోయినంత రాద్ధాంతం చేసింది సుందరమ్మ. ఇంతకీ ఆ ఆవు తాలూకు వివరాలివి.

ఆ ఆవు చనిపోయేటప్పటికి అది షష్టిపూర్తి జరుపుకొంది. ఇక దాని సర్వీసా అంటే సుందరమ్మగారు కాపురానికివచ్చిన మూడు మాసాలికి కొన్నారా ఆవుని. అలాంటి ఆవు చచ్చిపోడానికూడా తన కోడలు కాంతమే కారణం అంటుంది సుందరమ్మ.

కాంతం కాపురానికి వచ్చినవేళ మంచిది కాదని; అందుకే యిన్ని విపరీతాలు సంభవిస్తున్నాయని సుందరమ్మ గారి ప్రబల విశ్వాసం ఆవిశ్వాసాన్ని ధ్రువ పరచుకోడానికి, దృఢపరచుకోడానికి ఆమె అనేక విషయాల్ని ఆధారంచేసుకొని పై నిర్ణయాని కొచ్చింది.

ఏనాడో తాను కాపురానికి వచ్చినపుడు తన పుట్టింటారు సారెగా పెట్టిన పందిరి మంచం కాంతం కాపుర్నానికి వచ్చిన ఆరు మాసాలకు చెదపట్టి విరిగిపోయింది. అది కూడా కాంతంయింట్లో కాలుపెట్టిన ఫలితమే అంటుంది సుందరమ్మ.

కాంతం కాపురానికి వచ్చింతరువాత కూతురు రాజ్యం పుట్టింట్లోనే పురుడుపోసుకొంది కాని పుట్టిన పిల్లాడు దక్కలేదు. "చావు దప్పి కన్ను లొట్టపోయిందని" రాజ్యానికి మాత్రం ప్రాణాలు దక్కాయి. "పోతే శిశువు పోయాడుగాని తల్లి ప్రాణం దక్కింది. అంతేచాలు" అని అంతా సంతోషిస్తే యీ దుస్సంఘటనకు కూడా కాంతమే కారణం అని కోడలిపై దుయ్యబట్టింది సుందరమ్మ గారు. కోడలు యింట్లో కాలుపెట్టినవేళ మంచిది కాదనే" వాదనను బలపర్చుకోడానికిలాంటిసంఘటనలెన్నో సహేతుకంగా ప్రతిపాదిస్తుంది సుందరమ్మ.

మంచిని చెడ్డగానూ, చెడ్డని మంచిగానూ మార్చి నిరూపించ గల శక్తి మానవ మాత్రులలో ఏ కొద్దిమందికో వుంటుంది. కాని సుందరమ్మగారి కావిద్య "అరచేతిలో వుసిరికాయ" లాంటిది కోడలు కాపురానికి వచ్చింతరువాత కొన్ని మంచి ఫలితాలు కూడా కనబడకపోలేదు. అయినా వాటిలో కూడా చెడుగునే చూపించి తన తెలివితేటల్ని నిరూపించుకొంటుంది సుందరమ్మ ప్రభుత్వందగ్గిర ప్రతిపక్షంలా!

నిజం చెప్పాలంటే కాంతం కాపురానికి వచ్చిన అయిదు మాసాలకే కాంతం భర్తకు కలక్టరేటులో వుద్యోగం దొరికింది

(33-వ పేజీ చూడండి)

## ★ సోషల్ స్టడీస్ పేపరు ★

మార్కులు 40

షరా:-ఒక్క వాక్యములోనే జవాబు యివ్వవలెను. ఒక్కొక్కదానికి 5 మార్కులు.

(1) చోళు లనగా నెవరు?

చోళ్ళను పండించువారు.

(2) హర్ష చక్రవర్తి చేసిన పను లేవి?

ప్రతిపనిని హర్షించుటయే.

(3) ఔరంగజేబు ఎటువంటి వాడు?

రంగుజేబులు గలవాడు.

(4) ఫ్రెంచివారు మన దేశమునకేల వచ్చిరి?

మనకు ఫ్రెంచికట్ మీసములు నేర్పుటకు.

(5) వైస్రాయి గొప్పతనమేమి?

తూకమునందు వీసెడు బరువును కల్గియుండుట.

(6) రిప్పను ప్రభువు ఏ చట్టమును అమలునందుంచెను?

రిబ్బనులు ధరించమనెడి చట్టమును అమలుపరిచెను.

(7) పటేల్ అహింసాధర్మమును ఎంతవరకాచరించెను?

పొట్టేళ్లను చంపకుండ జాగ్రత్తపడుదాకా.

(8) జిల్లా బోర్డు బడులవల్లన విద్యార్థుల కెంత వుపయోగము కల్గెను?

ఈ పైన అడిగిన ప్రశ్నలన్నింటికి జవాబువ్రాయగలుగునంతటి వుపయోగము కల్గించెను.

పి. కాత్యాయని.

# ఆరువందల నల్లకో

# ఆంధ్రప్రదేశ్ ప్రధా



★ తురగా కృష్ణమోహనరావు ఎ



న్యాయమూర్తి
ప. సత్యనారాయణరాజు

బి. వి. రావు అనే బి. వెంకటరావు మోసంలో అందెవేసిన చెయ్యి అతనిది అసలు. అందిన వృత్తి మోసమేనట. అందువల్ల వచ్చే రాబడి మాత్రం జైలు శిక్ష! ప్రతీసారి నేరం అంగీకరించినా, సిద్ధాంత రీత్యా అప్పీలు చేసుకొనే వ్యక్తి అతడు. అతనికి అనంతపురం అసిస్టెంటు సెషన్సు జడ్జి నాలుగు సంవత్సరాలు, సేలం జడ్జి అయిదున్నర సంవత్సరాలు కఠినశిక్ష విధించారు. 'అసలే ఉబ్బసం వచ్చి బాధపడుతూంటే, ఈ రెండు శిక్షలూ ఏమిటి నాకు? రెండూ ఒకదాని వెనుక ఒకటి అమలుజరిపితే 1965 దాకా ఈ కటకటాల వెనకనే పడి ఏడవాలి. మన్నించి రెండూ ఒకే పారి అమలు జరిపేయ్యండి' అని జైలుసూపరింటెండెంటుద్వారా ఆంధ్ర ప్రదేశ్ హైకోర్టుకి మహజరు పెట్టుకొన్నాడు. [ఆంధ్రపత్రిక సెప్టెం 9, 1957]

కుమారి బసంత్ నాయర్ తండ్రి డా॥ కె. కె. నాయర్ హైదరాబాదు ప్రభుత్వోద్యోగిగా ఫింఛను తీసుకున్నాడు. ఆమె పర్భనీలో పుట్టిందికాని ఏ జిల్లాలోనూ స్థిరంగా నిలవలేదు. మహిళా కళాశాల నుంచి మంచి మార్కులతో ఇంటర్మీడియటు పేసయి, వైద్యకళాశాలలో ప్రవేశం కోసం దరఖాస్తు పెట్టుకొంది. ఆమెను హైదరాబాదు నగరవాసినిగా పరిగణించి, నగరంలో ఆమెకంటే మంచి మార్కులు వచ్చినవారు ఉండటంవల్ల ఆమె దరఖాస్తును నిర్వాహకులు త్రోసివేశారు. 'ఇదెక్కడి అన్యాయం? నన్ను నగరవాసినిగా పరిగణించటం శుద్ధ పొరపాటు. పైగా ఆడవాళ్ళకి ఎక్కువ సౌకర్యాలివ్వాలని రాజ్యాంగం ఘోష పెడుతూంటే, ఇన్ని ఇస్తాం స్త్రీలకంటూ కేటాయించడమేమిటి? హైకోర్టువారు దయతో కలగచేసికొని నాకు ప్రవేశమిప్పించాలి' అని రాజ్యాంగంలోని 226 వ సూత్రం ప్రకారం ఒక 'రిట్' దాఖలుచేసుకుంది.

[ఆంధ్రపత్రిక, సెప్టెం 26, 1957]

—నలగొండ జిల్లాలో ఇద్దరు పెద్ద మనుష్యులు. పెదమనుష్యులు కాబట్టే ధర్మసంగ్రహార్థం ఒక ఖూనీ కేసులో సాక్ష్యమిచ్చారు. ఖూనీకేసు హైదరాబాదు హైకోర్టువరకు పోతే, పునర్విచారణ చేయమని వెనక్కి పంపించింది. వీరు మళ్లీ సాక్ష్యం ఈయవలసివచ్చింది. ఎవరికైనా అవుతుంది పొరపాటు! వీరి మొదటి సాక్ష్యానికీ, రెండోదానికి తేడావచ్చిందట. వీళ్ళు అబద్ధం చెప్పారంటూ వెంటబడింది ప్రాసిక్యూషన్. మొదట మెజస్ట్రేటు కోర్టు; తరువాత సెషన్సు కోర్టు. 'చూడండి. వీళ్ళు అబద్ధమాడారు. తప్పుడు సాక్ష్యం చెప్పారు. వీళ్లని కాస్త శిక్షించండి' అంటూ ప్రాసిక్యూషన్ ఆంధ్ర ప్రదేశ్ హైకోర్టు నభ్యర్థించింది. [ఆంధ్రపత్రిక, సెప్టెం 22, 1957]

—ఎస్. కామేశ్వరరావుగారు. మొదట డిప్యూటి.ఎస్. పి.గా, తరువాత డి. ఎస్. పి గాపనిచేశారు, మదరాసు ప్రభుత్వపు హయాంలో. ప్రభుత్వం మొదట ఆయన పదవీప్రమాణాన్ని తగ్గించింది; తరువాత పదవినుంచి తొలగించింది. 'నాకు చాలా అన్యాయంజరిగింది. దయఉంచి నా ఉద్యోగం నాకు వచ్చేటట్టు చూడండి' అని ఆంధ్ర



ప్రధాన న్యాయ
శ్రీ కోకా సుబ్బ



న్యా॥ రాయ్‌మనోహర్ ఠక్రాడ్ న్యా॥ అన్సారీ న్యా॥ ఉమామహేశ్వరం

ట్లతో కలకల్లాడే

# ప న్యాయస్థానం

ం. వి. ఎల్ ఎల్. బి.





మూర్తి
రావు

హైకోర్టును వేడుకున్నారు.

[ఆంధ్రపత్రిక, ఆగస్టు4, 1957]

—నిజాం నవాబు రెండవ కుమారుడు మోజంజా. అతనిపై రజియాబేగం అనే షియా స్త్రీ దావా తెచ్చింది: 'నువ్వు నన్ను 1948 అక్టోబరులో వివాహం చేసుకున్నావు. నెలకు రెండువేల రూపాయలు ఇస్తానన్నావు. నీవల్ల నాకు ముగ్గురు ఆడపిల్లలు కలిగారు' అంటూ. 'నిజమే మరి!' అన్నాడు అతడు ఆమెకి సమాధానంగా. ఇంతలో మోజంజా భార్య అన్వార్ బీగం ఈ కేసులో నన్ను కూడా పార్టీగా చేర్చాలంటూ ముందుకు వచ్చింది. 'ఇది మా ఇద్దరికీ సంబంధించిన సంగతి. మధ్యలో నువ్వెందుకు పానకంలో పుడకలా?' అని వాది, ప్రతివాదీ ఇద్దరూ కలిసి ఆమె పార్టీ కావడానికి వీల్లేదన్నారు. పార్టీగా అన్వార్ బీగం రావడానికి వీలులేదని నిర్ణయించడంకోసం, రజియా బీగం ఆంధ్రప్రదేశ్ హైకోర్టులో సివిల్ రివిజన్ పిటిషన్ దాఖలు చేసింది. —[ఆంధ్రపత్రిక సెప్టెంబరు 22, 1957.]

వీళ్లంతా—ఈ రజియాబీగం, ఆ బసంత నాయర్, కామేశ్వరరావు, వెంకట్రావు, నలగొండ పెద్దమనుష్యులు—వీళ్లంతా కష్టాలుపడ్డారు; తమకు అన్యాయం జరిగిందని భావించారు. 'న్యాయం'-అంటే వాళ్ళనుకున్న న్యాయం అమలు జరపమని హైకోర్టును అభ్యర్థించారు. రజియా బీగం కేసు విచారించి, న్యా॥ సత్యనారాయణరాజు, 'వాది, ప్రతివాది కలిసి గూడుపుఠాణీగా ఈ కేసు తెచ్చినట్లుగా కన్పిస్తోంది. భర్త మరో పెళ్ళి చేసుకున్నాడంటే, ఆ విషయంతో భార్యకు సంబంధం లేకుంటే మరెవరికుంటుంది? అన్వార్ బీగంకూడా ఈ కేసులో ప్రతివాదిగా ఉండవల



న్యాయమూర్తి
పి. శ్రీనివాసాచారి

సిందే' అని తీర్పు చెప్పారు. అక్టోబరు 21వ తేదీన సుప్రీంకోర్టు డివిజన్ బెంచి ఒకటి ఈ తీర్పుపై అప్పీలు చేసుకోడానికి రజియాబీగంకు ప్రత్యేకానుమతి ఇచ్చింది. సి. పి. సి.లో ఆర్డరు 1 రూల్ 10 ని క్రింది కోర్టులు తప్పు అర్థం చేసుకొన్నాయని సుప్రీంకోర్టుకి దరఖాస్తులో రజియాబీగం మనవి చేసుకొన్నది. బసంత్ నాయర్ రిట్ దరఖాస్తుపై వాదోపవాదాలను ఆలకించిన ప్రధాన న్యాయమూర్తి శ్రీ కోకా సుబ్బారావు, న్యా॥ జగన్మోహన్ రెడ్డి ఆ పరిస్థితులలో ఆమెకు వైద్య కళాశాలలో ప్రవేశం లభించకపోవడం సక్రమమే అన్నారు. రికార్డులన్నీ సాకల్యంగా చదివి వెంకట్రావు శిక్షపూర్తిగా అనుభవించవలసిందే అన్నారు న్యా॥ మనోహర్ పర్షాద్. 'ఈ పెద్దమనుష్యులు ఇద్దరూ తప్పుడు సాక్ష్యం ఇచ్చింది నిజమే కావచ్చు. ఇంత ఆలస్యం చేశారు మీరు. ఇప్పుడు చేసేదేమీ లేదు. వారిని వెంటనే విడుదలచేయండి' అని పెద్దమనుష్యుల కేసు విచారించిన న్యాయమూర్తి ప్రభుత్వాన్ని ఆజ్ఞాపించారు. ఉద్యోగ ప్రమాణం నుండి తగ్గించడం సరే, ఉద్యోగం నుండి తొలగించడం ఏమీ బాగులేదు, అని ప్రభుత్వాన్ని మందలించారు న్యాయమూర్తులు ఉమామహేశ్వరం భీమశంకరం.

## గజేంద్రుడి 'రిట్'

పూర్వం గజేంద్రుడనే రాజుండేవాడు. ఒకసారి ఒక మొసలి అతని కాలు పట్టుకొని నీళ్ళల్లోకి ఈడ్చివెయ్యటం ప్రారంభించింది. వెంటనే పరలోకపు ప్రధాన న్యాయ



న్యా॥ రంగనాథం చెట్టి



న్యా॥ జగన్మోహన్ రెడ్డి



న్యా॥ కమర్ హసన్.

# ఆంధ్రప్రదేశ్ ప్రధాన న్యాయస్థానం

స్థానంలో ఒక 'రిట్' దాఖలు చేసుకున్నాడు. పరలోకపు ప్రధాన లక్షణం ఏమిటంటే అక్కడ న్యాయవిచారణ శాఖ (జ్యుడీషియరీ) కార్యనిర్వహణశాఖ (ఎక్జిక్యూటివ్) రెండూ పరమాత్మ చేతుల్లోనే ఏకమై ఉంటాయి 'రిట్' దరఖాస్తుతో పాటు జత చేర్చి పంపిన అఫిడవిట్టులో గజేంద్రుడు 'లావొక్కింతయు లేదు ..' అంటూ మనవి చేసుకున్నాడు ఒక క్షణంలో దివ్య దృష్టితో న్యాయాన్యాయ విచక్షణ పూర్తి చేసుకొన్న పరమాత్మ, సిరికిం జెప్పకుండానే శంఖుచక్ర యుగమున్ చేదోయి సంధించకుండానే పరువు పరువువచ్చి దుష్టశిక్షణ, శిష్టరక్షణ చేశాడు ఈ దివ్యదృష్టివల్లనే పరమాత్మ, నోటీసు లిప్పించడం, సమను జారీ చెయ్యించటం, వాది ప్రతివాదులతరఫు న్యాయవాదుల వాదాలలోని న్యాయాన్ని పరిశీలించడానికి యత్నించడం–ఇటువంటి తెడదలన్నీ లేకుండా పోయాయి.

పరలోకంలో ఐతే ఫరవాలేదుగాని, మనలోకంలో న్యాయవిచారణశాఖ, కార్యనిర్వహణశాఖ వేర్వేరుగా ఉండడమే సమంజసమనే అభిప్రాయానికి వచ్చారు మన వాళ్ళు కేవలం న్యాయపరిపాలనా కార్యక్రమాలలో మాత్రమే నిమగ్నమై ఉంటుంది మన ప్రధానన్యాయస్థానం. కార్యనిర్వహణ బాధ్యత రాష్ట్ర కేంద్ర ప్రభుత్వాలది. తమ కిష్టంవచ్చిన పన్నులు విధించటంతో ప్రారంభించి, తమ కిష్టం వచ్చిన వ్యక్తులతో అకౌడమీలు స్థాపించడంవరకు ప్రభుత్వాలు చేస్తూంటాయి. అందులోను ఈ నాటి విసంక్షేమ ప్రభుత్వాలు మిగులు బియ్యానికి ధరలుకట్టడం దగ్గర్నుంచి, కవిత్వానికి విలువలు కట్టడం వరకూ అన్నీ అవే చేస్తూంటాయి. వ్యక్తుల హక్కులను అణచివెయ్యడంకోసం ప్రభుత్వ యంత్రం ముందుకు వెనకకు కదులు తూంటుంది అందుకనే, సాధ్యమయినంత వరకు ప్రభుత్వప్రభావానికి అతీతమైన న్యాయవిచారణా వ్యవస్థను నెలకొల్పడానికి ప్రతీ దేశంలోను ప్రయత్నిస్తారు. మన రాజ్యాంగంకూడా హైకోర్టులకు, సుప్రీం కోర్టుకు ప్రభుత్వ ప్రభావాన్ని ప్రతిఘటించ గలిగిన అధికారాలు ఇచ్చింది న్యాయ శాస్త్ర పరిజ్ఞానంతోబాటు, స్వతంత్ర ఆలోచనాశక్తి గలిగిన వారే సర్వత్రా న్యాయమూర్తులుగా నియుక్తులౌతున్నారు

## హక్కుల రక్షణ

వ్యక్తులకీ, సంస్థలకీ, ఈ రెండూ కలిసి



న్యాయమూర్తి శ్రీ కుమరయ్య



న్యాయమూర్తి శ్రీ చంద్రారెడ్డి

ఏర్పడిన సమాజానికీ హక్కులున్నాయి మనకి రాజ్యాంగం ప్రాథమిక హక్కులను కొన్నింటిని ప్రసాదించింది ఇంకొకరి చర్యలవల్ల మనకు కష్టం కలిగిందని భావించినప్పుడు, మనకు అన్యాయం జరిగిందని మనం అనుకొన్నప్పుడు, న్యాయస్థానాన్ని శరణు వేడుతాం ఇతరులు చట్టబద్ధంగా

చేసిన పనులవల్లకూడా మనకు కష్టాలు కలగవచ్చు. అందువల్ల మన హక్కులకు భంగం వాటిల్లినప్పుడే న్యాయస్థానం కలగజేసికొని న్యాయం చేకూర్చ యత్నిస్తుంది ప్రజాప్రతినిధులెందరో కలిసిరాజ్యాంగంసిద్ధంచేశారు రాష్ట్ర కేంద్ర ప్రభుత్వాలు అందులో పొందుపరచబడిన సూత్రాల ననుసరించే శాసనాలు చేస్తాయి అవి జారీచేసే ఆజ్ఞలు చట్టబద్ధంగా ఉంటాయి — సర్వసాధారణంగా! శాసనబద్ధమైన చర్యలవల్ల మనకు కష్టాలు కలిగితే, న్యాయస్థానం ఏవిధంగాను కలగచేసికోలేదు పైగా–కేసుకోర్టుఖర్చులు ఇచ్చుకోమంటుంది మదరాసు అమ్మకంపన్ను చట్టానికి ఒక సవరణ ప్రతిపాదించి, పొగాకులలో కొన్నిరకాలపై పన్ను విధించింది ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం దేశవాళీ పొగాకు వ్యాపారం చేసేవారిలో వర్జీనియా పొగాకు వ్యాపారం చేసేవారిపై మాత్రమే అమ్మకం పన్ను విధించటం ప్రాథమిక న్యాయ సూత్రాలకే విరుద్ధమని ఆంధ్రప్రదేశ్ హైకోర్టులో కొందరు వర్తకులు 'రిట్' దరఖాస్తులను దాఖలు చేసుకొన్నారు చట్టాలందరికీ సమానరక్షణ ప్రసాదించాలనే ప్రాథమిక న్యాయసూత్రం అమెరికాలోను, మనదేశంలోనూ న్యాయమూర్తుల చేతుల్లో ఏవిధంగా పరిణామాలు పొందిందో వివరిస్తూ, వర్జీనియా పొగాకుపై మాత్రం పన్ను వేయటంవల్ల ఆ ప్రాథమిక న్యాయానికేమీ భంగం వాటిల్లలేదని నిర్ణయించారు ప్రధానన్యాయమూర్తి శ్రీసుబ్బారావు, న్యా॥ జగన్మోహన్ రెడ్డి

అయితే–ప్రభుత్వ చర్యలు చట్టవిరుద్ధాలైనా, చట్టాలు రాజ్యాంగ సూత్రాలకి అననుకూలంగా ఉన్నా–ఆ చర్యలు, ఆ చట్టాలు అక్రమమైనవని, చెల్లవని అనడానికి ఎన్నడూ వెనుదీయలేదు, మన న్యాయమూర్తులు క్వెట్టాలో జన్మించిన కొందరు మహమ్మదీయులు కలకాలంనుంచి ఆంధ్రప్రదేశ్‌లో వివిధ ప్రాంతాలలో వ్యాపారం చేసికొంటున్నారు వాళ్ళు భారత విభజన తర్వాత పౌరులుగా తమ హక్కులేవో తెలియక పాకిస్తాన్‌నుండి ప్రయాణానుమతి పత్రాలను పొందారు 'పౌరసత్వ చట్టం' సెక్షన్ 8 (2) ని ననుసరించి నెలరోజులలోగా రాష్ట్రాన్ని విడిచి పొమ్మనమని ఆంధ్రప్రదేశ్ అంతరంగిక శాఖ గత జూలైలో ఉత్తరువులు జారీ చేసింది ఈ సమస్యపై రిట్ దరఖాస్తులను దాఖలు చేసుకొన్నది, మన ప్రధాన న్యాయస్థానం వీటిని విచారించిన ప్రధాన న్యాయ

మూర్తి సుబ్బారావు, న్యా॥ జగన్మోహన్ రెడ్డి, సిటిజన్‌షిప్ వీరు (పౌరసత్వ చట్టం) సెక్షన్ 9 (8) చెల్లనేరదని నిర్ణయించారు (ఆంధ్రపత్రిక, సెప్టెంబరు 15, 1957 )

పాఠ్యపుస్తకాల ప్రచురణ దగ్గరనుంచి పాలు పెయ్యి అమ్మకంవరకు ప్రతీది జాతీయంచేసి సామ్యం చేసుకోవాలని ఉవ్విళ్ళూరే ప్రభుత్వాల యుగం ఇది రచయితలను, కవులను జాతీయంచేస్తామంటే ఫరవాలేదు కాని, పరిశ్రమలలో కొన్నిటిని జాతీయం చేస్తామంటే, రాజ్యాంగంలో పొందుపరిచిన కొన్ని ప్రాథమిక హక్కులతో సంఘర్షణ వస్తుంది వాదిగా ప్రభుత్వం ప్రారంభించే వ్యాజ్యాలతో బాటు, ప్రతివాదిగా వ్యాజ్యాలలో పాల్గొనే అవసరం నానాటికి ఎక్కువ ఔతోంది ప్రభుత్వ పక్షాన న్యాయస్థానాలన్నింటిలోను సమర్థతతో వాదించే న్యాయవాదుల ఆవశ్యకత ఎంతో ఉన్నది

ఆంధ్రప్రదేశ్ హైకోర్టులో ప్రభుత్వ న్యాయవాదిగా శ్రీ మైదవోలు శేషాచలపతి పనిచేస్తున్నారు ప్రభుత్వం తరఫున పబ్లిక్ ప్రాసిక్యూటర్‌గా శ్రీ డి మునికన్నయ్య నాయుడు వ్యవహరిస్తున్నారు ఇద్దరూ సమర్థులైన న్యాయవాదులుగా పేరుగడించుకొన్నారు న్యాయశాస్త్ర పరిజ్ఞానానికి, వాదనా పటిమకి ఇరువురూ వృత్తిలో గౌరవం గడించుకొన్నవారే వీరు గాక, ప్రభుత్వం కోరినప్పుడు అడ్వకేట్ – జనరల్ శ్రీ దువ్వూరి నరసరాజు ప్రభుత్వపక్షాన వాదిస్తూంటారు న్యాయవాదిగా శ్రీ నరసరాజు ప్రతిభను కొనియాడడం అప్రస్తుతం వృత్తిలో అత్యున్నతస్థాయి నందుకొన్న న్యాయవాదినే ప్రభుత్వం అడ్వకేట్ - జనరల్‌గా నియమిస్తుంది క్లిష్టమైన న్యాయసూత్రాలను సులభమైన శైలిలో న్యాయమూర్తులకు చక్కగా అవగాహన అయేట్లు వీరు వాదిస్తారు ప్రధానన్యాయమూర్తి కోర్టు అడ్వకేటు- జనరల్ వాదిస్తున్నప్పుడు సర్వ సాధారణంగా ఉత్సుకులైన న్యాయవాదులతోటి, కుతూహలులైన ప్రేక్షకుల తోటి నిండిపోతుంటుంది ఆ రంగస్థలం అటువంటిది! పాత్రధారు లటువంటివారు!

## కోర్టులో కిటకిట

శ్రీ నరసరాజు అడ్వకేట్-జనరల్ పదవితోబాటు, హైకోర్టు న్యాయవాదుల సంఘానికి అధ్యక్షపదవినికూడా నిర్వహిస్తారు హైకోర్టు లైబ్రరీకి సరిగా క్రింద బార్ అసోసియేషనువారి గదిఉంది అరవై మంది న్యాయవాదులకై నిర్దేశించబడిన, ఈ గదిలో ఆరువందల నల్లకోటు, గౌనులు చెల్లాచెదరుగా తిరుగుతూంటే కళ్ళు చీకట్లు కమ్ముతాయి! హైకోర్టులో ఒకేరోజున



న్యాయమూర్తి శ్రీ భీమశంకరం

మూడు నాలుగు కేసులలో హాజరవవలసివచ్చే న్యాయవాదులు గౌనులు, పుస్తకాలు తమ పెట్టెలలో పెట్టి తెచ్చుకొని, స్థలంలేక ఈ హాలులో బల్లలపైన, బెంచీలక్రింద, బీరువాలపక్కన వాటిని దాచుకుంటారు—థర్డు క్లాసు కంపార్టుమెంటులో ప్రయాణం చేసే ప్రయాణీకులలాగ! బార్ అసోసియేషను కొరకు ఒక ప్రత్యేక భవనాన్ని ఆ ప్రాంతంలోనే నిర్మించడానికి ప్రభుత్వం యోచన చేసిందిట! రెండులక్షల పదివేలరూపాయలకు ఒక ప్లాను వేసిందిట! శాసనసభ డబ్బు మంజూరుచేసిందిట! కాని-పబ్లికువర్క్సు శాఖ ఇంకా పని ప్రారంభించలేదు

అసలీ హైకోర్టుభవనం ఆరుగురు న్యాయమూర్తులు, వారిసంఖ్యకి తగిన కార్యాలయోద్యోగులు, అరవై మంది న్యాయవాదులు పని చేయడానికి నిర్దేశించబడినభవనం అందులో ఇప్పుడు పన్నెండుగురు న్యాయమూర్తులు, ఆరువందలమంది న్యాయవాదులు, మూడు వందలమంది కార్యాలయోద్యోగులు పని చేస్తున్నారు బార్ అసోసియేషన్ హాలుకి ఆనుకొనే ఉన్న చిన్నగదిలో సభ్యులకు మాత్రమే ఉద్దేశించబడిన ఒక కేంటీన్ ఉంది అందులో ఒకేసారి పన్నెండు పదముగ్గురు కంటే ఎక్కువమంది కూచొని కాఫీ తాగటానికి వీలులేదు ఎక్కడి పన్నెండుకీ ఎక్కడి ఆరువందలు! కాఫీ సేవిద్దామని వచ్చే లేడీ లాయరు పక్క 'కంపార్టుమెంటు'లో కూచొని తాగవలసివస్తోంది

మూడు నెలలకని తాత్కాలికంగా ఉపయోగించ దలచిన ఒక షెడ్డులో కార్యాలయోద్యోగులు పని చేస్తున్నారు కొందరు మరికొందరు ఒక వరండాలో కూచొని పని చేస్తున్నారు న్యాయవాదులకు టైపు చేసి పెట్టే టైపిస్టులు చాలామంది మెట్లప్రక్కన, మేడమెట్ల ప్రక్కన, స్తంభాల ప్రక్కన కూచొని పని చేస్తుంటారు ఇది ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ఎర్రతేపు మహాగ్రంథంలో న్యాయస్థాన కార్యాలయోద్యోగుల కష్టాల ఘట్టం

ఐతే—పై వర్ణనచదివినవారు, హైకోర్టు చూడనివారు—అదొక గాలీ వెలుతురూ లేని ఒక చిన్న భవంతిలా ఉంటుందని ఊహించుకోవచ్చు అంతకంటె పొరపాటు వేరొకటి ఉండదు హైకోర్టుభవనం అత్యంత సుందరమైన భవనాలలో ఒకటి రాజధాని నగరంలోని దర్శనీయ భవనాలలో, ఉస్మానియా విశ్వ విద్యాలయంతోను, ఆసుపత్రితోను, హైకోర్టును కూడా ప్రత్యేకంగా పేర్కొనాలి ఐతేనేం? మహాఘనత వహించిన నిజాం ప్రభువరేణ్యుడు నిర్మించిన భవనాలన్నీ కొద్దిమంది సుఖంగా గడుపుకొనడానికి నిర్దేశించబడ్డాయి, చాలమందైతే కష్టంగా కూడా గడుపుకోలేరు!

మీరు నయాపుల్ (కొత్తవంతెన) నుంచి పురానాపుల్ (పాత వంతెన) వద్దకు పోయే సిమెంటు బాటలను చూసేఉంటారు మూసీ నదికి ఇరుప్రక్కల రెండు బాటలున్నాయి ఇటువంటివి వీటికి అటుప్రక్కన ఉస్మానియా అసుపత్రి, ఇటు ప్రధాన న్యాయస్థానం ఉన్నాయి మీరు ఒక వేళ బస్సుమీద రావచ్చు వస్తే, సాలార్జంగు మ్యూజియం వద్ద ఎనిమిదవనంబరు బస్సు దిగుతారు మ్యూజియంకి ఎదురుగాఉండే రోడ్డుపైననే హైకోర్టు భవనం ఉంది క్రింది భాగములో రిజిస్ట్రారు శ్రీ ఓబులరెడ్డి కార్యాలయం, హైకోర్టు సాధారణ పరిపాలనకి సంబంధించిన కార్యాలయాలు, బార్ అసోసియేషను, కొందరు న్యాయమూర్తుల న్యాయస్థానాలు ఉన్నాయి న్యాయ విచారణకు ముందు జరగవలసిన కార్యకలాపాల నిర్వహణకు సంబంధించిన శాఖలు—అప్పీలు ఎగ్జామినర్సు, బెంచి క్లర్క్సు శాఖ వంటివి ఉన్నాయి రెండవ అంతస్తుపై ప్రధాన న్యాయమూర్తి, మిగిలిన న్యాయమూర్తుల కోర్టులు, మువురు ప్రభుత్వ పక్ష న్యాయవాదుల కార్యాలయాలు, న్యాయమూర్తుల ఛేంబర్సు ఉన్నాయి హైకోర్టు లైబ్రరీకూడా ఈ భాగంలోనే ఉంది షార్టుహేండు రైటర్సుగది, కొందరు న్యాయమూర్తుల ఛాంబర్సు అంతకు పైఅంతస్తులో ఉన్నాయి.

# ఆంధ్రప్రదేశ్ ప్రధానన్యాయస్థానం

రిట్ దరఖాస్తులకు, రివిజన్ పిటిషనులకు, అప్పీళ్ళకు సంబంధించిన కాగితాలను రిసీవింగు సెక్షను వారు స్వీకరిస్తారు. తరువాత కేసుకు నంబరువేసి, నామకరణం చెయ్యటం జరుగుతుంది. 'కాలదోషం పట్టిందా? అమలులోఉన్న న్యాయసూత్రాల ప్రకారం ఇక్కడ రిట్ దరఖాస్తు పెట్టుకోవచ్చా? లేదా అప్పీలుకు మాత్రమే అవకాశం ఉందా? ఈ న్యాయాన్వేషణ పద్ధతిని అభ్యర్థించడానికి దరఖాస్తుదారుకు హక్కుందా? లేదా?' అన్న విషయం అప్పీలు ఎగ్జామినర్సు పరిశీలిస్తారు. సాధారణంగా న్యాయనిర్ణయ సూత్రాలను పూర్తిగా అవగాహన చేసుకొన్నవారే ఈ సెక్షనులో ఉంటారు కాని ఒక్కొక్కప్పుడు వారికికూడా సందేహాలు కలుగుతుంటాయి. ఉదాహరణకి అక్టోబరు మాసంలోనే నిర్ణయానికివచ్చిన ఒకానొక కేసులో, 'రిట్ దరఖాస్తు వేయడం ఒక వ్యక్తిగతమైన హక్కు కాబట్టి, దరఖాస్తు దారుడు చనిపోయినప్పుడు ఆ దరఖాస్తుకి సంబంధించిన కేసులో అతని వారసులను పార్టీలుగా చేర్చవచ్చా? లేదా వారిని వేరే రిట్ పడవేయమని అడగాలా?' అని సందేహం కార్యాలయోద్యోగులకు కలిగింది. 'రిట్ ఆస్తిపాస్తులకు సంబంధించినదైనప్పుడు, వారసులను పార్టీలుగా చేర్చవచ్చు' అని సందేహ నివృత్తి చేశారు న్యా॥భీమశంకరం.

ఇక్కడ ఒక విషయాన్ని ప్రస్తావించారు. కీ శే. తలిశెట్టి రామారావు కోర్టుల బాధలను గురించిన ఒక వ్యంగ్య చిత్రంలో ప్రతిస్తంభం వెనుకనుంచి ఒక చెయ్యి (లంచం కోసం) చాచి ఉన్నటు చూపించాడు. కాని నేటి ఆంధ్రప్రదేశ్ హైకోర్టులోమీకు చాచినచేతులు కనపడవు. దీనికి మనం హైకోర్టు కార్యాలయోద్యోగులు అందరినీ, పరోక్షంగా దీనికి బాధ్యులయిన ప్రధాన న్యాయమూర్తిని, రిజిష్ట్రారునీ అభినందించాలి.

కేసులో ప్రతివాదులకి నోటీసులు వెళ్ళవలసిన బాధ్యత బెంచిక్లర్కుల సెక్షను స్వీకరిస్తుంది. ఏజడ్జిముందు ఏకేసు ఎన్నడు రావాలో పోస్టింగు సెక్షను నిర్ణయిస్తుంది. సాధారణంగా కేసులువిచారణకు రావడానికి నెలలూ సంవత్సరాలు పడుతుంది కాని కొన్నికేసులు తొందరగా నిర్ణయం కావలసినవి ఉంటాయి. (బసంతినాయర్ రిట్ దరఖాస్తు సెగ్గినా, ఈలోగా ఆరునెలలు గడిచిపోతే ఆమెకేమీ ప్రయోజనం ఉండదు) ఈ కేసులలో న్యాయనిర్ణయం ఆలస్యమైతే, న్యాయం కానట్టేలెక్క. ముందుగా న్యాయమూర్తిగా నివేదించుకొంటే, కాలయాపన లేకుండానే కావలసిన పనులన్నీ జరిగి కేసులు విచారణకు వస్తాయి.

హైకోర్టులో వారం అంటే సోమవారం నుంచి శుక్రవారం వరకు. వచ్చేవారంలో న్యాయమూర్తులు ఏ ఏ కోర్టులలో కూచొని ఎప్పుడు ఏ తరహా కేసులను విచారిస్తారో ముందుగా తెలుపుతూ, ప్రధాన న్యాయమూర్తి ఆదేశాల ననుసరించి, రిజిష్ట్రారు సిద్ధంచేసి ప్రకటిస్తారు. రు 7,500 ల కంటె విలువగలిగిన ఒక తరహా కేసులను విచారించడానికి; మరణశిక్ష యావజీవ కారాగార శిక్షలపై అప్పీళ్ళను విచారించడానికి— ఇటువంటి వాటికి న్యాయమూర్తులు ఇరువురు కలిసి 'డివిజన్ బెంచి'గా ఏర్పడి విచారణ చేస్తారు. ప్రతీ కోర్టుముందు, ఆరోజు, ఆకోర్టులో విచారణకు రాబోయే కేసులను సూచించే 'కాజులిస్టు' ఒకటి తగిలించబడి ఉంటుంది

## కార్యదక్షత

ఆంధ్రప్రదేశ్ ప్రధాన న్యాయ స్థానం వంటి పెద్దవ్యవస్థను నిర్ణీతకాలానికి కార్యక్రమ నిర్వహణం జరిగేటట్లుపనిచేయించడం క్లిష్టమైన సమస్యే ఐనా–మన హైకోర్టులో వేలు పెట్టి చూపించడానికి వలను పడకుండా కార్యక్రమంసాగిపోతూంది న్యాయమూర్తుల సహకారం లేకుంటే ఈ విధంగా ఉత్తమ స్థాయిలో కార్యక్రమ నిర్వహణ సాధ్యం కాదు. మన న్యాయమూర్తులు కష్టపడి పని చేస్తారని పేరు తెచ్చుకొన్నారు. రోజూ హైకోర్టు 10-45 నుంచి 1-45 వరకు, మధ్యాహ్నం 2-30 మొదలు 4 45 వరకు పనిచేస్తుంది రోజుకి 5 గం॥ 15 ని॥ పనిచేసే హైకోర్టు బహుశః భారతదేశానికంతకీ ఇదొక్కటే. పనిచేసే ఈ కాలంలోనే సాధ్యమైనంత ఎక్కువ పని పూర్తిచేసేది కూడా దేశానికంతకీ మన న్యాయమూర్తులే అయ్యుండవచ్చు. రాష్ట్రంలోని న్యాయస్థానాలు కొన్ని మన ప్రధాన న్యాయస్థానం వద్ద ఇంకా శిక్షణపొందవలసిన అవసరం ఉంది

సరిగా గం॥ 10-45 లకి, గం॥ 2-30 లకి న్యాయమూర్తులు తమతమ స్థానాలలో ఎలా ఆసీనులౌతారో-అదేవిధంగా గం॥ 1-45 కి, గం॥ 4-45 లకి గంట కొట్టేసరికి వారు పని చాలిస్తారు. వెండికర్ర ముందు చేతో ఎత్తి పట్టుకొనిఅటెండరు దారిచూపిస్తూంటే, తమ తమ ఛేంబర్సులోనికి వెళ్ళిపోతారు. ఈ విధంగా నిర్ణీతకాలాన్ని అనుసరించి న్యాయమూర్తులు పనిచేయడంవల్ల వాది ప్రతివాదులకి న్యాయవాదులకి తమ కార్యక్రమాన్ని సుస్పష్టమైన పద్ధతిలో నిర్ణయించుకోడానికి అవకాశంచిక్కుతుంది. న్యాయసూత్రాలను, కేసు'లా'నుక్షుణ్ణంగాతయారుచేస్తే న్యాయమూర్తుల సమయాన్ని సాధ్యమైనంత తక్కువ వ్యయం చేయడానికి అవకాశం ఉంటుంది. ఇరుపక్షాలకి ప్రయోజనకరమైన విషయం ఇది.

గత మాసానికి ఆంధ్రప్రదేశ్ హైకోర్టులో 27000 కేసులు విచారణకోసం పడి ఉన్నాయి అని 'ఆంధ్రపత్రిక' ప్రకటిం

(51-వ పేజీ చూడండి)



దీపాలంకృతమైన ఆంధ్రప్రదేశ్ హైకోర్టుభవనం

# ★ మూఢనమ్మకాలు ★

(27-వ పేజీ తరువాయి)

"ఈకాలంలో కలక్టరేటులో వుద్యోగం దొరకడం అంటే మాటలు కాదు; అదృష్టం బాగుంది; కాలం కలసి వచ్చింది" అని అంతా సంతోషించారు. కాని సుందరమ్మమాత్రం "ససేమిరా" అంది "ఛా! ఛా! వెధవనౌఖిరీ! కట్టలు మోసుకొని తిరగడంకూడా ఒక వుద్యోగమేనా ? వాడి తెలివి తేటలకు ఏతాశీల్దారీగిరియో రావలసింది, కాని అయినింటిదాని అదృష్టం బాగాలేక యీ ఖర్మ పట్టింది" అని ఏమేమో వ్యాఖ్యానించింది సుందరమ్మ

సుందరమ్మగారి పినతల్లి ఒకామెవుండేది. ఆమెకు పిల్లా పాపా ఎవరూ లేరు ఆమె చనిపోతూ ఆమె తాలూకు ఆస్తియావత్తూ సుందరమ్మగారిపేర వ్రాసి చనిపోయింది. అనుకోని ఆస్తి అకస్మాత్తుగా కలసివచ్చి ఎందుకు అంతా సంతోషించారు. (కొంతమంది యీర్ష్యకూడా పడ్డారనుకోండి) నిజానికి ఈ సంఘటన కాంతం కాపురానికి వచ్చిం తర్వాతే జరిగింది అంతా కాంతం కాపురానికి వచ్చిన వేళమంచిదన్నారు. కాని సుందరమ్మగారు మాత్రం విశ్వాస రాహిత్య తీర్మానంలా ప్రజావాక్కును ఒక్కమాటతో కొట్టేసింది" ఈ ఆస్తి కలుస్తుందని ఏనాడో అనుకొన్నాం పోతూ పోతూ ఆ దిక్కుమాలినది ఆస్తిలో కొంత భాగం కాల్చేసింది ఇంతకీ దానికవలసిన పనేముంది ఇదంతా మాదురదృష్టం మా యింట్లో శనితాండవ మాడుతుంటే అదృష్టం రమ్మంటే ఎలావస్తుంది " అని సుందరమ్మగారు ఉవాచ.

ఇలాంటి సంఘటనలు ఎన్నో జరిగాయి. ఎన్ని జరిగినా సుందరమ్మగారు మాత్రం కాంతం యింట్లో కాలుపెట్టినవేళ మంచిదని మాత్రం ఒప్పుకోదు.

ఆ వేళ వుదయం, పదిగంటలవుతుంది కాంతం వంటపని చేస్తూవుంది. సుందరమ్మగారు సులోచనాలు ధరించి, అధ్యాత్మ రామాయణంలోని కొన్ని కీర్తనలను మందర స్థాయిలో పాడుకుంటూ బియ్యం బాగు చేస్తూంది ఇంతలో కొడుకువచ్చిన ధ్వనివిని తలెత్తి చూసింది కొడుకు మొగం చూసేసరికి సుందరమ్మకి నవ్వాగలేదు.

"అదేమిట్రా ఇంత ఎండలో చెమటలు కక్కుకుంటూ వచ్చేశావ్. ఆఫీసులేదా ఏమిటి?" అని కొడుకుని అనునయపూర్వంగా; కళ్లద్దాలను కాస్త సడలించి ప్రశ్నించింది సుందరమ్మ "అదికాదే.. ' అంటూ కొడుకు తడబడుతూ నీళ్లు నములుతున్నాడు.

భర్తరాక గమనించిన కాంతం ఆత్రుతగా తలుపువారకు వచ్చి నిలబడింది

"మనకి లాటరీలో లక్ష రూపాయిలు వచ్చాయమ్మా ఇదిగో టెలిగ్రామ్" అంటూ కొడుకు ఆనందం, ఆశ్చర్యం మేళవించిన గొంతుకతో అన్నాడు.

ఒక్కసారిగా విన్న యీ సంతోషవార్త సుందరమ్మకు మాట రానీయలేదు. ఎట్టకేలకు గొంతుక సవరించుకొని "ఏమిటీ? లక్ష రూపాయిలే? మనకే? నిజమేనా బాబూ!" అంటూ సుందరమ్మ అంతవరకూ అడ్డుగా వున్న సులోచనాల్ని తీసి వాటిని శుభ్రంగా తుడిచి టెలిగ్రామ్ చేతబట్టుకొని, అదితనకేం అర్థంకాక పోవడంచేత, ఇంగ్లీషు భాషను యింకా వుంచి తనలాంటివాళ్ళకి యిబ్బంది కలుగజేస్తున్న ప్రభుత్వానికి పడచీవాట్లు పెడుతూ ప్రక్కనే సంతోషంతో నిలబడిపోయివున్న కాంతానికిచ్చింది అదేమిటో చదివి అర్థం చెప్పమని.

అత్తగారు తన కిచ్చిన ఆధిక్యతకు తనలో తను మురిసిపోతూ కాంతం గదద కంఠంతో తడబడుతూ యిలా చెప్పింది.

"గుడ్‌లక్ కాంపిటేషన్స్‌లో రెండవ బహుమానము క్రింద లక్ష రూపాయిలు వచ్చా"యని స్వచ్ఛమైన నూరు నయాపైసాల తెలుగుభాషలో తర్జుమా చేసింది కాంతం.

"అయ్యో! ఇంతా చేస్తే రెండవ బహుమానమూ వచ్చింది. ఆవచ్చేదేదో మొదటి బహుమానమే వచ్చి యేడుస్తే బాగుణ్ణు అయినా ఏంచెస్తాం? మనకింతే ప్రాప్తం అంటూ సుందరమ్మ సంతృప్తి పూర్వకంగా ఒక బరువైన నిశ్వాసం విడిచింది

"ఎన్నాళ్లనుంచో కడుతున్నాను ప్రతీ నెలా పదీ, పదిహేను దండగే అవుతోంది, కాని ఏనాడూ ఒక్కకానీకూడా ప్రైజుగావచ్చిన పాపాన పోలేదు. సరే దాని అదృష్టం ఎలాగుందోనని కాంతంపేర కట్టాను క్రిందటిదఫా! టపీమని లక్ష రూపాయిలొచ్చాయి. అంచాత యీ అదృష్టంఅంతా కాంతందే" అని కొడుకు భార్యవైపు క్రీగంటిగా చూస్తూ నవ్వుతున్నాడు భర్త మాటలకు కాంతం సగర్వంగా ఓ చూపుచూసి, ఈనాటికైనా తన అదృష్టానికి ఫలితం దక్కిందికదా అని సంతోషిస్తోంది

"దానిపేర కట్టావా! అందుకే రెండవ బహుమానం వచ్చింది ఇంకెవరిపేరనుకట్టినా బాగుండేది, మొదటి బహుమానంవచ్చేది ఏం చేస్తాం? ఇంతకీ అది కాపురానికి వచ్చిన వేళ మంచిదికాదు."

ప్రక్కనేవున్న కాంతం అత్తగారిమాటలకు ఆశ్చర్యపోయింది. అత్తగారి చెరగని విశ్వాసానికి తరగని మూఢనమ్మకానికీ ఒక దీర్ఘ నిశ్వాసంవిడచి భర్తకి వేన్నీళ్లు తోడేందుకు పెరటివైపు నడిచింది.

సుందరమ్మగారు మాత్రం నాటికీ నేటికీ "కాంతం కాపురానికి వచ్చినవేళ మంచిది కాదనే వాదిస్తోంది." ★

# వనితా లోకం

## ఆంధ్రలో మహిళాభ్యుదయం

సాంఘిక సంక్షేమ కార్యక్రమం యొక్క లక్ష్యం సాంఘిక పురోగమనం. నిరంతరం సాగుతూ ఉండవలసిన ఈ సాంఘిక పురోగమనం దేశప్రజల విద్యాభివృద్ధుల మీద ఆధారపడిన విషయం. ముఖ్యంగా ఒక దేశపు స్త్రీల విద్యాభ్యాసానికి విజ్ఞానాభివృద్ధికి అవకాశాలు పెంపొందించనిదే, పిల్లలను చక్కగా పెంచి పెద్దచేయడానికి అవకాశాలు ఏర్పరచనిదే ఇది సాధ్యము కాదు. సాంఘిక సంక్షేమం యొక్క ప్రాముఖ్యాన్ని దృష్టిలో నుంచుకొని, అందుకు కృషి జరగవలసిన అవసరాన్ని గుర్తించి, 1953 ఆగస్టులో కేంద్ర సాంఘిక సంక్షేమ సలహాసంఘాన్ని నెలకొల్పడం జరిగింది ఈ సంఘం ప్రథమ పంచవర్ష ప్రణాళికా కాలంలో తగు ఫలితాలను సాధించింది. రెండవ ప్రణాళికా కాలంలో ఈ కార్యక్రమాలకు గాను ప్రభుత్వం దేశం మొత్తంమీద ముప్పైకోట రూపాయలు ఖర్చు పెట్టాలని నిశ్చయించింది.

కేంద్ర సంఘం నిర్ణయించిన కార్యక్రమాలను సులభంగా చురుకుగా నిర్వహించడంకోసం, ఎక్కడి కక్కడ కట్టుదిట్టంగా నడుపడంకోసం ప్రతిరాష్ట్రానికి ఒకొక్క సలహాసంఘాన్ని ఏర్పాటు చేశారు ఆంధ్ర రాష్ట్రానికి సలహా సంఘం 1954 జూలైలో నెలకొన్నది. ఆంధ్రప్రదేశ్ సంఘం 1957 జనవరిలో ఏర్పాటు అయింది. శ్రీమతి ఎ. చన్నఘంటమ్మ కృష్ణారావు ఈ సలహా సంస్థకు అధ్యక్షురాలు.

గ్రామీణ జనాభ్యుదయం—ముఖ్యంగా స్త్రీజనాభ్యుదయం - ఈ సంఘాల ముఖ్య లక్ష్యం. పల్లెలలోని స్త్రీలకు వీటివలన యెంతైనా ప్రయోజనం ఉంది. జిల్లాకొక ప్రాజెక్టు ఐదేసి గ్రామకేంద్రాలు కలసి ఆయా ప్రాంతాల సంక్షేమ కార్యక్రమాలను నడిపిస్తున్నాయి.

ఆంధ్రప్రాంతములో 23 ప్రాజెక్టులు, తెలంగాణాలో ఆరూ, మొత్తం 29 ప్రాజెక్టులు ఆంధ్రప్రదేశ్‌లో ఇప్పటికి ఏర్పడినవి. సుమారు 150 గ్రామ కేంద్రాలున్నవి. రెండవప్రణాళిక కాలంలో, జిల్లాకు నాలుగు ప్రాజెక్టుల చొప్పున అభివృద్ధి చేయవలసి ఉన్నది.

జిల్లా స్థాయిలో ఉద్యోగులు, ఉద్యోగేతరులతో కూడిన సలహాసంస్థ లున్నవి విద్యావంతురాలైన ఒక ముఖ్యసేవిక ఒకొక్క సంఘం కార్యక్రమాలపై పర్యవేక్షణ చేస్తూ ఉంటుంది గ్రామకేంద్రాలలో వివిధములైన సేవా కార్యక్రమాలు అమలు జరుగుతున్నవి పసిపిల్లలకు 'ప్రి బేసిక్' తరగతులు ఉన్నవి స్త్రీలకు చేతిపనులు, కుట్టుపనులు, అల్లికలు మొదలైనవాటిలో శిక్షణ ఇస్తున్నారు. మంచి శిక్షణపొందిన మంత్రసానులను నియమించారు వైద్యసదుపాయాలుచేస్తున్నారు. పిల్లలకు, స్త్రీలకు విజ్ఞానవినోద కార్యక్రమాలను ఏర్పాటుచేశారు. వీటివల్ల వీరికి సంక్షేమ కార్యక్రమాలపట్ల ఆసక్తి, అభిమానంకలిగి పెరిగే అవకాశంఉంది వయోజన విద్యాబోధనవలన ఎందరో స్త్రీలు వ్రాయను, చదవను నేర్చుకొంటున్నారు. స్త్రీలు తీరిక వేళలలో కబుర్లతో తగాదాలతో కాలం వృథా చేయకుండా, చేతిపనులు నేర్చుకోవచ్చు చదువుకున్న, శిక్షణపొందిన సేవికల దగ్గర కూర్చుని, వారితో వివిధ విషయాలపై మంచీచెడ్డా మాట్లాడి, తెలియనివి తెలుసుకొని, ఆరోగ్యసూత్రాలు మొదలగునవి తమ నిత్యజీవితంలో అనుసరించడానికి ప్రయత్నించాలి. ఈ కార్యక్రమాన్ని సంక్షేమ సంఘాలద్వారా జరుపాలని కార్యకర్తల ఆశయం. జిల్లా కేంద్రములలో గౌరవ కార్యకర్తల ఆధ్వర్యాన నడిచే ఈ కేంద్రాలు ఆంధ్రప్రదేశ్‌లోని 17 జిల్లాలలో ఉన్నవి మిగతా మూడుజిల్లాలలోను త్వరలోనే స్థాపించుతారు.

కాని ఈ కార్యక్రమాలకయ్యే ఖర్చులో కొంతభాగము గ్రామీణులు భరించవలసి ఉన్నది. ఒక గ్రామములో సంక్షేమ కేంద్రం సక్రమముగా నడచుటకు ఆ గ్రామస్థుల సహాయం సానుభూతి అవసరం. సరికిసరి ధనం సమకూర్చేభారం ఇలా ఒప్పగించడం వల్ల ప్రజలంతా వీటి ప్రాముఖ్యాన్ని, అవసరాన్ని గుర్తించడానికి మరింత దోహదం జరుగుతుందని భావించవచ్చు.

గ్రామ గ్రామాలకూ సాంఘికసేవ అందచేయాలనే ఉద్దేశ్యంతోనే ప్రభుత్వ స్త్రీ సంక్షేమశాఖ జాతీయ విస్తరణ కార్యక్రమాలు మొదలగునవి నడుపుతున్నది. ఒకే లక్ష్యముతో పనిచేస్తున్న కేంద్ర సాంఘిక సంక్షేమ సలహాసంస్థ, సమాజ వికాస మంత్రిత్వశాఖల కార్య కలాపాలను సమన్వయపరచడానికి కేంద్రప్రభుత్వం పూనుకొంటున్నది ద్వితీయప్రణాళిక కాలంలోనే ఈ సమన్వయం జరుపవలసి ఉన్నది. ఇందువలన సేవా కార్యక్రమముల స్థాయి అభివృద్ధిపరచి, విస్తృతం చేయడానికి అవకాశం కలుగుతుంది పెద్దనగరాల్లోని స్త్రీలకు ధనసంపాదనకుఅవకాశంకల్పించడంసంక్షేమ సంఘ కార్యక్రమాలలో ఒకటి విజయవాడ, హైదరాబాద్ నగరాలలో అగ్గిపెట్టెల ఫ్యాక్టరీలు రెండిటిని సహకార పద్ధతిపై నెలకొల్పి నడుపుతున్నారు మధ్యతరగతి స్త్రీలు తమ ఇండ్లనుండి వెలికిరాకుండానే అగ్గిపెట్టెల తయారీలో పాల్గొని ధనార్జన చేస్తున్నారు.

ఈ విధముగా కుటుంబానికి ఆర్థికంగా

(42- వ పేజీ చూడండి)




ఆంధ్రలో మహిళాజన ప్రగతి పేరిట చెప్పుకోతగ్గ గొప్పవిషయాలలో వవ్వేరు (నెల్లూరుజిల్లా) పంచాయితీలో అన్ని స్థానాలకూ స్త్రీలే ఎన్నిక అయి గ్రామపరిపాలన సాగించడం ఒకటి. బాధ్యత స్వీకరించిన కొద్దికాలంలోనే ఆ ఊరుకు విద్యుచ్ఛక్తి సరఫరా ఏర్పాటు చేయించారు. ఈ పంచాయితీ అధ్యక్షురాలు శ్రీమతి వవ్వేటి విమలాదేవి (మధ్యనున్నవారు). భారతదేశం మొత్తంమీద తొలి మహిళా పంచాయితీ ఇదే.

# నా మోషి

## ఎన్. సూర్యాబాయి

మనలో చాలామందిమి ఎంతనాగరికత, లోకజ్ఞానం, విద్యవున్నా ఉందనుకున్నా మనికి తెలియకుండానే అనేకపొరపాట్లు, తప్పులు చేస్తూఉంటాము. అర్థంలేని అహంకారము చెలాయిస్తూ ఉంటాము.

మిడిమిడిజ్ఞానంతో ఎదుటివాళ్ళమనస్సును ఎంతగానో గాయపరుస్తాము. నామోషీపడి అయినవాళ్ళనికూడా అవమానిస్తూవుంటాము. కొందరు తెలిసిచేస్తారు. కొందరు తెలీక చేస్తారు.

నేను చదువుకొనేరోజుల్లో ఒకసంఘటన జాగాను రు

విదోఘారం చదువుకొనే 18 సం॥ల యువతి టిప్‌టాప్‌గా వుండేది. దర్జాగా ఆమెకు ఎండనక, వానఅనక సరిగ్గా 1 గం॥కు టిఫన్‌తీసుకొని 50 ఏళ్ళ స్త్రీవచ్చి చింత చెట్టుక్రింద కూర్చునేది. ఆసంగతి అమ్మాయిలు మొత్తం అందరికీ తెలుసు. ఆముసలి ఆమె ఓర్పుకు సానుభూతిగా ఒకసారి ఆమెవైపు చూచేవారు అందరూ.

ఇంత ఓర్పుగల ఆమెగురించి తెలుసుకోవాలని ఒక టీచరుకు బుద్ధిపుట్టి ఆ అమ్మాయిని అడిగారు.

ఆమె ఏమాత్రం సందేహంలేకుండా ఆమె 'మా వంటమనిషి' అని చెప్పింది. కొద్దిరోజులకి నిజంతెలిసింది—ఆమె, ఈ అమ్మాయి మేనత్తఅనీ, చిన్నవాటినుండీ తినీ, తినకా అల్లారుముద్దుగాపెంచి అడిగిన గొంతెమ్మ కోర్కెలుతీరుస్తూ చదువు చెప్పిస్తోందనీను.

ఆ టీచరుకు అమితకోపంవచ్చి ఆయువతిని నానాచివాట్లు పెట్టారు. ఇంతకృతఘ్నురాలని ఈమాటే ఆ పెంచిన మేనత్తవింటే హృదయం బ్రద్దలయిపోదూ!

కొంతమంది యువకులు, యువతులు లోకజ్ఞానంలేకుండా చదువుకంతో ఇష్టమొచ్చినట్లు ఖర్చుచేయడం, వెనుక తల్లి, తండ్రుల పరిస్థితులు ఆలోచించకుండా కొన్నలో జల్సాగాతిరగడం వందలు తెప్పించుకొని

కొందరు సహృదయులూవుంటారు మరి!

వైజాగ్‌నుండి వనూ కావలసిన సామాన్లకోసం బజారుకువెళ్ళాను. ఒకనర్సు తన తల్లిని తీసుకు షాపుకువచ్చింది, ఏమీ తెలియని అమాయకురాలు తల్లి మోకాలుపైకి బట్టకట్టు

(42-వ పేజీ చూడండి)





















## చీరలకు లంగాలకు
## డిజైన్లు

పి పుష్పావతి

నెల్లూరు



# వంటలు



## ఇడ్లీలకు, దోసెలకుచట్నీ

నేను చెప్పబోయే ఈ శనగపిండి పచ్చడి ముఖ్యంగా ఇడ్లీలలోకి తరువాత దోసెలలోకి చాలా బాగుంటుంది చెయ్యడం కూడాచాలా తేలిక మనము ఈ పచ్చడి చేసే ముందు అనగా 5 నిమిషాలముందు కొంచెం చింతపండు ఒక గిన్నెలో నానవేసుకొని నానిన తరువాత దానిని నీళ్ళలో బాగా పిసికి పుల్లు పులలు తీసివెయ్యాలి ఈ చింతపండు రసము మరీ చిక్కగాకౌకుండా మరీ నీళ్ళగాను వుండనట్లు చేసుకోవాలి తరువాత ఆ రసములో సరిపోవునంత వుప్పు కలపాలి తరువాత కుంపటిమీద బూర్లె మూకుడు కాలేసి పైన చెప్పిన చింతపండు రసానికి సరిపోయేటంత, అనగా మరీ గట్టిగా కౌకుండాను, మరీ పల్చగానుకాక గరిట జారుగా వుండేటట్లు సరిపోవు జల్లించిన శనగపిండిని తీసుకొని కాలిన మూకుడులో కమ్మనివాసన వచ్చువరకు వేయించుకొనవలెను తరువాత ఆ పిండిని ప్రక్కను వుంచుకొన్న చింతపండు రసములో పోయవలెను మరల మూకుడు కాలవేసి అందులో నూనె వేసి నూనె బాగా కాగినతరువాత ఎండు మిరపకాయ ముక్కలు, మినప పప్పు, శనగ పప్పు, ఆవాలు, కరివేపాకు వేసి అవి అన్నీ వేగిన తరువాత ఆ పోపును ఈ శనగపిండి, చింతపండురసంవున్న గిన్నెలో పోసి, కమ్మనివాసన పోకుండునట్లు మూత వేయవలెను కొన్ని నిమిషములు ఆగిన తరువాత మూతతీసి చేతితో చింతపండురసంలో ఆ శెనగపిండి, పోపు కలిసేటట్లు బాగా కలుపుకోవలెను ఈ పచ్చడిని ఇడ్లీలలోగాని, దోసెలలోగాని వేసుకొన్నచో చాలా రుచిగా నుండును ఇది చదివినతరువాత ఒకసారి ప్రయత్నించి చూడండి ఇంగువ ఇష్టమైనవారు యింగువకూడ పోపు సామానులు వేసేముందు నూనెలో వేసి చేసుకోవచ్చు కొద్దిగా చేసి చూడండి ఎక్కువగాచేసి సరిగా కుదరకపోతే, చింతపండు, శనగపిండి, పోపు సామానులు నష్టమయ్యాయని నన్ననకండి

మద్దాలి రత్నమాల(శంకర్ నగర్)

* * *

## మిరపకాయల బజ్జీలు

కావలసిన సామాన్లు ½ పావు నువ్వులు, వాటిలో సగం గసగసాలు, కొబ్బరి ఒక చిప్పలో సగము, నిమ్మకాయంత చింతపండు, కొద్దిగ అల్లము, కొంచము ధనియాలు, రెండు వెలుల్లిపాయ రెబ్బలు

ముందు గసగసాలు రోట్లోవేసి కొద్దిగ నూరి, ఆపైన నువ్వులు, కొబ్బరి, చింతపండు, తగినంత వుప్పు, అల్లం, జీలకఱ్ఱ, ధనియాలు, వెల్లులిపాయలు అన్నీ వేసి మెత్తగా నీళ్ళు చల్లుతూ నూరాలి నూరిన ముద్దని ఒక కళాయిగిన్నెలోకి తీసుకోవాలి

పెద్ద పచ్చిమిరపకాయలుఅయితే 80 లేక 85 కాయలకు సరిపోతుంది మిరపకాయతీసుకొని పిన్నుతోనో, చాకుతోనో తొడిమదగ్గరనుంచి చివరిదాకా గీరాలి. ఈ గీరినకాయలలో నూరివుంచుకున్న ముద్దను పట్టినంత కూరాలి

మధ్యాన్నము టిఫినుచేసేట్లయితే ప్రొద్దున కాయల్లో కూరి వుంచుకోవాలి అట్లా అయితే కాయలుపూరి, కారము బాగా తగిపోతుంది

శనగపిండిలో తగినంత వుప్పు, కారము, చిటికెడు సోడావేసి బజ్జీలపిండి కలుపుకోవాలి నూనె మరిగినాక మిరపకాయలు పిండిలో ముంచి నూనెలో వేయాలి ఎఱ్ఱగావేగాక ఒక పళ్లెములోకి తీసుకోవాలి ఇవి చాలా బాగుంటాయి వెల్లుల్లిపాయ, ధనియాలు, ఇష్టమున్నవాళ్లు వేసుకోవచ్చు లేనివాళ్ళు లేదు

దార్వేములపూర్ణరాధ,
(హనుమకొండ)



చింత పిక్కలాట

—ఫొటో వనల కృష్ణకుమార్]

## * ఆనప * కాయతో *

1 ఆనపకాయ పరమాన్నము - లేత ఆనపకాయ తొక్కతీసి ఎండుకొబ్బరి కోరాముతో, కోరుకొని, ఒక కప్పుకోరుకి, 3 కప్పులపాలు," 1 కప్పు పంచదార చొప్పున కొలుచుకోవాలి ఆనపకాయ కోరు, పాలు ఒక స్టెయిన్‌లెస్‌స్టీలు పాత్రలో వేసి పొయ్యిమీద పెట్టి, బాగా కాచి పంచదార, ఏలకపొడి, వేయించిన జీడిపప్పు ద్రాక్షపళ్లు, కుంకుమపువ్వు వేసి 10 నిమిషాలు కాచిదించాలి వేడిమీద తినటానికి చాలా రుచిగా ఉంటుంది

2 ఆనపకాయదోసెలు - ఒకఆనపకాయ తొక్కలు, ముదురగింజలు తీసుకోవాలి 1 పావుసేరుకందిపప్పు, 1 పావుసేరు బియ్యం మూడుగంటలు నానవిచ్చి శుభ్రముగా కడిగి, ఆనపకాయ, తొక్క, గింజలు, తగినంత, పచ్చిమిరపకాయలు, అల్లం, జీలకఱ్ఱ, వుప్పు వేసి, అంత పలాచగా కాకుండా రుబ్బి పెనంమీద నూని రాసి, గరిటెడు రుబ్బిన పిండి పోసి, గరిటతో సెరివి, పెసరట్లలాగ కాల్చాలి ఇవి అన్నంలో తినడానికి

(42-వ పేజీ చూడండి)




## అరుచి

ఒక్కొక్కప్పుడు నిక్షేపం చేసిపెటినా నోటికి పోదు. ఆకలివేస్తుంది కాని తీరా తినబోతే సయించదు. అలాంటి సమయములలో:

అల్లములో కొంచము ఉప్పుకలిపి పుచ్చుకోవచ్చు; లేదా,

దాల్చినచెక్క, ఏలకులు, వేచిన మిరియాలు, సమ భాగములుగా తీసికొని, మెత్తగాదంచి పూటకు 1 తులము చొప్పున బెల్లములోకలిపి పుచ్చుకోవాలి

సునాముఖి ఆకు తెప్పించి (ఇది కొట్లలో దొరుకుతుంది) శొంఠి కలిపి నీళ్ళలో బాగుగా మరగనిచ్చి, ఆ కషాయమును ప్రతి పూట పుచ్చుకొనవలసినది.

నాభిపైన ఆవాలు నూరి పట్టు వేయవచ్చునని కొందరు చెప్పుతారు.

నిమ్మకాయ రసములో, జీలకర్ర, సైంధవ లవణము, అల్లపుముక్కలు వేసి బాగుగా నానబెట్టి, ప్రతిరోజు ఉదయం, సాయంకాలం 4 రోజులపాటు పుచ్చుకొనిన మరునాటికి కరకర ఆకలివేసి, ఏ వస్తువైనను నోటికి రుచిగా నుండును. పైత్యము చేసినప్పుడుగూడ దీనిని వాడితే చాలా మంచిది

## కళ్ళమంట

చేమంతిపువ్వులు కొన్ని మంచినీళ్ళలో నానవేసి కాచి ఆ నీళ్ళతో నేత్రములను తడుపుచుండవలయును.

ఒకతులం పటిక 10 తులాల నీళ్ళలో కరిగించి ఆ నీటిబొట్లు కనుగుడ్లపై వేయవలయును.

పచ్చకర్పూరము, చక్కెర, ఆవువెన్నతో మర్దనచేసి కంటిరెప్పలకు తరచుగ కాటుకగా పెట్టిన కండ్లమంటలు త్వరలో తగ్గును

## కలక

మంచినీళ్ళలో పసుపువేసి, ఆ నీటితో కండ్లు తుడుస్తూ ఉండవలెను.

చక్కెర మంచినీటిలో వేసి కరిగినపిదప గంట కొకసారి ఆ నీటిచే కండ్లు తడుపుచుండవలెను.

బాగా మరిగిన వేడినీటిలో రెండు గురివిందగింజలెత్తు నల్లమందు వేసి కళ్ళకు ఆ నీటి ఆవిరిని పట్టవలయును

## కండ్లు దురద మొదలైనవాటికి

అతిమధురము (ఇదికూడా కొట్లలో దొరకుతుంది) సైంధలవణము సమభాగములుగా, నీటితో నూరి కండ్లచుట్టు పూయాలి.

ఇనుపపాత్రలో నిమ్మపండురసము వేసి కొంచము గట్టిపడువరకు ఇనుముతో మర్దించి కన్నులచుట్టు పట్టువేస్తారు

మునగాకురసము తేనెతోగలిపి కన్నులకు పట్టువేసినా మంచిదే ★

ఎం. వి. కమల —(రాజమండ్రి)

## ఇంటి శుభ్రత

కె. వి. యస్. అచ్యుతవల్లి

ఈమధ్య ఒకసారి బెజవాడ వెళ్ళా. మా కనకంఅంది "సీత ఇక్కడేవుంది వాళ్ళింటికి వెళ్ళి మరీ రైలెక్కు. నిన్ను తీసుకురాలేదని నన్ను అంటుంది."

సరే అనిబయలుదేరా. వాళ్ళత్తవారుబాగా వున్నవాళ్ళే. మొగుడికి పెద్దఉద్యోగం. పిల్లా పెద్దాఓ ఇరవయిమంది వున్నారు. ఇంట్లోనే. మా సీతకి కుట్లూ అల్లికలూ అన్నీ వచ్చును డోర్ కర్టెనూ, రేడియో డిజైన్లుతో ఓ దొరబంగళాలా వుంచాలని దాని తాపత్రయం కాని దాని అత్తవారికి డబ్బైతేవుంది కాని ఇల్లు పరిశుభ్రత, దాని అందచందాల గురించి అంత పట్టింపులేదు.

వాళ్లాయనే వున్నాడు. ఏదైనా వ్రాసుకుంటూ గమ్మున పెన్ను టేబిల్ క్లాత్‌కి తుడిచేస్తాడు. వాళ్లాడబిడ్డపిల్లలు ఇంట్లోకి, బయటకి వస్తూపోతూముక్కుని ఓసారిడోర్ కర్టెన్‌కి తుడిచేస్తారు. వాళ్ళతోడికోడలుచంటి పిల్లాణ్ణి ఓ సోఫాలోపడుకోబెడుతుంది. దాన్ని వాడు యధాశక్తి పాడుచేస్తాడు సోఫాకవర్ మార్ళదాకా చెడుకంపు కొడుతూవుంటుంది. వాళ్ళత్తగారు వంట చేస్తూ చేస్తూ ఆమాటా ఈమాటా చెబుతూ చెబుతూ ఇవతలికి వస్తూంటుంది అలాంటప్పుడు, తనమసి చేతితో ఓసారి డోర్ కర్టెన్‌ని స్పృశిస్తేగాని ఆవిడ ఇవతలికి వచ్చిన పనిపూర్తి అవనే అవదు. వాళ్ళమరిది వున్నాడు అతను చదువుకొనే గది ఓ చిన్న అడివిలా వుంటుంది. చదువుకొని పుస్తకాన్ని అతను మంచం మీద పడుక్కునేమూల టేబిల్ మీద గిరాటెట్టాడు. ఆ పుస్తకానికి కనుక అదృష్టం బాగావుంటే ఆ టేబిల్‌ని ఆశ్రయించాలి. లేకపోతే లేదు.

మా సీత కాపరానికివెళ్ళి ఏడాదవుతోంది. వచ్చిన మరుక్షణంనుంచి ఆ ఇంటి శుభ్రత శుచికోసం ఏదైనా చేసినా అది వ్యర్థమౌతూంది. అది ఎన్ని కర్టెన్లు వేసినా, మరది పుస్తకాలు ఎన్ని సర్దినా అవి మళ్ళీ యధాప్రకారమే తయారు మనుష్యుల స్వభావాలు అవగింజంతైనా మార్చుకోరు. ఇల్లు చూడబోతే చెరువంత ఇల్లు కాని ఎక్కడ కూర్చుందామన్నా ఇంటినిండా వలిచిన బత్తాయి తొక్కలు, నమిలిన చెరుకుపిప్పి వగైరాలతో నిండివుంటుంది. ఏదన్నా అంటే "పిల్లాజెల్లా వున్న ఇల్లుమరి" అంటారు. ఇల్లు అందంగా అమర్చుకొనటలో ఇంట్లో వున్న అందరికీ ఆసక్తివుండాలి. అంతేకాని

(42-వ పేజీ చూడండి)




"పాకల సీత" గారు వ్రాసిన మాటపట్టింపు వ్యాసము చాల బాగున్నది. మాటలతో ఎదుట వారి హృదయాలను గాయపరచే అలవాటు కలవారి కిది వినతి.

కుమారి విశాలాక్షి. రాంపిళ్ళ, గుంటూరు.

* * *

## ఎవరికి!

కామేశ్వరిగారు (23-10-57) ఆంధ్ర పత్రిక సచిత్ర వారపత్రికలో "మిగతా ముక్కాణి ఏం చేశావ్" అను వ్యాసము బాగా వ్రాశారు.

మా పక్కింటిలో ఒకరు ఉండేవారు. ఆమె భర్తగారు నెలకు సరిపడ వస్తువులు తీయరు. దినము ఎనిమిది అణాలు, లేక ముప్పావలా ఇచ్చేవారు. దానితో అన్ని వస్తువులు ఆమె కొనవలెను. అందువలన ఆమె నానా అవస్థా పడేది. ఆమెకు నా అభివంద నములు.

కె. శ్యామల, చిత్తూరు.

* * *

"మిగతా ముక్కాణి ఏం చేశావ్" అను వ్యాసాన్ని కామేశ్వరిగారు వున్నదివున్నట్టు చాలా చక్కగా వ్రాసారు. వారికి నా అభి నందనములు. చాలామంది ఇలాంటి వ్యాసాన్ని చదివి, ఆడదాని కష్టసుఖాలను అర్థం చేసుకొని గౌరవిస్తారని ఆశిద్దాం.

టి. రమాదేవి, మార్కాపురం.

* * *

## ఏదైనా సరే

ఒక్క కూరనారల విషయమే కాకుండా, ఏ విషయమైనప్పటికీ, ఎక్కువగా గుచ్చి, గుచ్చి అడుగుతుంటే, ఎలాంటి వారికైనా అసహ్యం వేస్తుంది.

ఎ. రంగ, గూటాల.

## ఓళిగలు

16-10-57 ఆంధ్రపత్రికలో ఓళిగలగురించి బాగానే వ్రాశారుకాని. రవ్వ విషయమై అంత శ్రమపడవలసరము లేదు. రవ్వకు బదులు మైదాపిండి కూడా వాడవచ్చును. ఇంకా దీనికి కందిపప్పే కావలెనని ఏమి లేదు, సెనగపప్పుతోకూడా చాలా బాగుం టాయి.

యస్. విజయలక్ష్మి.

* * *

## అంచులతో సంచులు

నా స్నేహితురాలు ఒకావిడ మంచి మంచి అంచులన్నీ తీసి ద్వారంకి సరిపడేటట్టు ఒకకర్టైన్ కుట్టింది. అలాగే సంచీలు కూడా తయారుచేసింది వాటికూర్పి అవి చూడటా నికి ఎంతో ముచ్చటగా వున్నాయి. పాత బట్టలంటే వేగిరంగా చిరిగిపోతాయి కాని అంచులు అంత వేగిరం చిరిగిపోవు. ఏది కుట్టినా చాలా అందంగా వుంటాయి.

సి. హెచ్. రూపవాణి, రాజగాంగ్‌పూర్.

* * *

## ఆఖరుమాట

పాత బట్టల వుపయోగం వ్యవహారం మధ్యతరగతి కుటుంబాలకే ముఖ్యం. వారు కట్టుకునే చీరలు పాతవై కట్టుకుందుకు పనికిరానప్పుడు వాటి అందం ఎల్లా వుంటుందో అందరికీ తెలుసు. అసలు బట్టలు పాతపడేవరకు వాటి రంగు, అందం నిలిస్తే చాలు. ఆ తర్వాత వుపయోగింమాట దేవుడెరుగు. ఇంక జమీందార్ల ఇళ్ళలోను, పెద్ద ఆఫీసర్ల ఇళ్లలోను పాతబటలు వుపయో గించి పొదుపుచేద్దామనే ఆలోచన వారికి రానేరాదు. వారి బట్టలు పాతపడ్డా కొత్త వాటికిమల్లేనే వుంటాయి ఇంక పాతచీరలు డోర్‌కర్టెన్‌లు కుట్టుకునేబదులు రాత్రులు పక్క వేసుకొనీ, పిల్లలకు బొంతలు కుట్టుకునీ వుపయోగించవచ్చును. లేకపోతే ఏదైనాపని చేయుచుండునిపనిమనిషికిఇవ్వవచ్చును. ఇన్ని చేసినా ఇంకాబటలు వుంటూనే వుంటాయి. అల్లాంటప్పుడు చేతిడబ్బు పెట్టకొనకుండా సామాను తీసుకొంటేనే మంచిది. సామాను మోజులో పడి కట్టుకుందుకు పనికివచ్చే చీరలు ఇవ్వకూడదు.

పాకల సీత, ఏలూరు.

* * *

## డిటో

అమ్మబోతే అడివి, కొనబోతే కొరివి అన్న వ్యాసంమీద ఒక సోదరుడు విమర్శ వ్రాయగా చదివాను. "వనితాలోకం" చదివి మనమూ ఒక విమర్శ వ్రాద్దామనే వుద్దేశ్యం తో విమర్శించాలేమోననిపిస్తోంది.

ఆవ్యాసంలో వాళ్లుచేసే మోసం కనిపెట్టి విడమర్చి అందరికి తెలియాలని వ్రాశారుగాని 4 వీ. పేపర్లు వీశన్నరకింద ఖరీదుకట్టి సొమ్ము తీసుకున్నాము అని వ్రాయలేదు. పేపర్లు కొనుక్కొని తూరుతేంనికి అమ్మకుని పొట్ట పోసుకుందామని వీధిలో తిరిగేవాడుమోసం చెయ్యడానికిసిద్ధపడ్డాడంటే ఆశ్చర్యంలేదు. 4 వీ. పేపర్లు దగాచేసి పట్టుకుపోయేవుంటే ఆవ్యాసం వ్రాసే అవకాశమే లేదు. వాడు చేసే దగా కనిపెట్టేరు కనుక పేపర్లు అమ్ము కోదలచిన వారికి పనికివస్తుందని వ్రాశారు. ఏదైనా వ్రాశేటప్పుడు ఎంత ఆలోచించా లో విమర్శించేటప్పుడుకూడ అంత ఆలోచన అవసరం

కె. వి. ఎస్. లక్ష్మి (పెదపూడి)

* * *

"అమ్మబోతే అడవి, కొనబోతే కొరివి" అను వ్యాసమును "కొల్లూరు వెంకటసుబ్బ లక్ష్మి"గారు చాల చక్కగా వ్రాసినారు. నిజముగా యీ వ్యాసములో వారు చర్చిం చిన విషయములు సామాన్యముగా మనము ప్రతిరోజూ గమనించే వైనప్పటికీ కూడా అందులో మోసమును, దగాను వారు బట్ట బయలు జేసినారు.

వీరు చర్చించిన విషయములలో ముఖ్య మైనది పేపర్ల అమ్మకము తూనికలలో చేసే దగాలలో చాలరకములు గలవు. ఈ మోస మును వీరు బాగా చదువుకున్న వారిదగ్గర కూడా చేయుచున్నారు. ఆంధ్రా యూని వర్సిటీ హాసలులో ఒక పర్యాయము తూని కలో మోసము గ్రహించి పేపర్లు కొను వానికి దేహశుద్ధికూడ చేశారట. యిటువంటి మోసాలను పత్రికద్వారా ప్రచారంలోనికి తెచ్చినందుకు రచయితకు నా ధన్యవా దాలు

అడుసుమల్లి సీతాదేవి [బుర్రిపాలెం]

* * *

# ★ వనితా వాణి ★

## గ్రంథాలయం అంటే....

మాటలు ఒక పక్కనించే మాట్లాడొచ్చు గాని రాతలుమాత్రం నాలుగు పక్కలనించీ చూచి రాయాలి. అభాండాలు వేయడమే కాని అపవాదులు తీసే సహాయం మాత్రం ...నవాళ్లకింకా చేతకావడం లేదు. తప్పులు కనిపిస్తాయా వ్రాసేద్దామా అని చూడక సహృదయంతో ఆ తప్పుల్ని పరిశీలించమని మనవి. గ్రంథాలయంపై వ్యాసం చూచాక నాకు కొన్ని విషయాలు రాయాలని పించింది.

గ్రంథాలయాలు ఆడవాళ్లకు వేరుగా ఉంటే సాయంత్రం వేళ నలుగురూ కలిసి పిచ్చాపాటీ మాటాడుకోవచ్చు నన్నారు— మంగళా కందూర్ గారు. పిచ్చాపాటీ మాటాడుకోటానికి మహిళా సంఘాలూ లేడీస్ క్లబ్బులూ ఉన్నాయి. అక్కడే కూర్చుని చదువుకొనేవారు చాలమంది ఉంటారు. అందువల్ల నిశ్శబ్దంగా వుండడం చాలా అవసరం. గ్రంథాలయం అతి పవిత్రమైన స్థలం అని గుర్తించాలి.

లైబ్రేరియన్ చదివినపుస్తకాలే ఇస్తున్నాడన్నారు మన పరిస్థితే కాదు, అతని పరిస్థితికూడా కొంచెం ఆలోచించాలి. మన లాంటివాళ్ళు ఎంతోమంది ఉంటారు. అందరూ తలా ఒక పుస్తకం పట్టుకువెళ్తారు. అలాంటప్పుడు మన మడిగిన పుస్తకాలు వుండవు. ఎన్నిమార్లు తిరిగినా ఫలితం వుండక పోవచ్చు. పూటపూటకూ ఇలా తిరగలేమనుకుంటే, డబ్బుంటే-రెండు మూడు టిక్కెట్లకు చందాలు కట్టడం మంచిది. ఒకేసారి రెండు మూడు పుస్తకాలు తెచ్చుకోవచ్చు. అప్పుడు వారాని కోసారి వెళ్ళొచ్చు. అలాకూడా వెళ్లలేము అనుకునేవారు, ఒకసారి తీరిగ్గా ఓ పుస్తకము, పెన్సిలూ పట్టు వెళ్ళి, కేటలాగు అడిగి తీసుకుని అందులో మనం చదవదలచిన వన్నీ మొత్తం రాసుకోవాలి. మనం రాసుకున్న కేటలాగు ప్యూను చేతికిచ్చి పంపుతూ వుండాలి. మనం చదివిన పుస్తకం అందులో కొట్టేస్తుండాలి. కొట్టకుండా వున్న పుస్తకాలలో ఏదుంటే అది పంపుతూంటాడు లైబ్రేరియన్. మళ్లీ కొత్త పుస్తకాలు లైబ్రరీకి వచ్చాయని తెలియగానే మళ్ళి వెళ్ళి రాసుకోవచ్చు. కేటలాగులో నాలుగైదు పుస్తకాలు తీసి రాసి పంపిస్తామంటే విలులేదు. ఆ నాలుగూ లేకపోవచ్చు ఆ కేటలాగంతా పంపుతూండాలి-వాటిలో ఏదుంటే అది ఇస్తాడు.

అయితే కొందరు లైబ్రేరియన్‌లలోకూడా తప్పులు లేకపోలేదు. అయినా ఇప్పుడప్పుడే వాళ్ళని అనొద్దు మనవరకు మనం బాగా నడిచి తరువాత వాళ్లమీద దాడిచేద్దాం.

ఆడవాళ్ళకి వేరే లైబ్రరీలుండాలన్నారు. కొన్నివూళ్ళలో కనీసం ఒక్క లైబ్రరీకూడా లేక అవస్థపడుతోంటే ఆడవాళ్ళకు వేరే లైబ్రరీలు అడగడం న్యాయంకాదు.

అసలు వారికి వేరే లైబ్రరీ కాదు అడగవలసింది. ఉన్న లైబ్రరీలోనే కొంతకాలం మనకు కేటాయించమనాలి. వారానికి ఒక రోజుకాని, ఒక పూట కాని ఆడవాళ్ళకే విడిచి పెట్టాలి. అలా వీల్లేదంటే ఒక గది ఆడవాళ్ళకు వుంచాలి వీళ్ళకి సప్లయి చేయడానికి ఓ స్త్రీ అటెండరుని వేస్తే సరిపోతుంది. ఈ విషయంలో ఆంధ్రదేశంలో ఒకే ఒక లైబ్రరీ ముందడుగు వేసింది. ఇది ఎంతో ప్రసంశించదగిన విషయం.

ఇంటింటికీ తిరిగి పుస్తకాలు సప్లయిచేసే 'వేన్సు' త్వరలో రాబోతున్నాయి. దానివల్ల ఆడవాళ్ళసమస్య కొంత తీరవచ్చు. వున్న లైబ్రరీలే ఎంతో అభివృద్ధి చెందవలసిన అవసరంవుంది. ఎక్కువమంది మనుషుల్ని అందులో పనిచేయడానికి వేయాలి చదువుకోడానికి వీలైనకుర్చీలుండాలి మంచిమంచి పుస్తకాలు తెప్పించాలి. ఇంకా ఎన్నో ఎన్నో...ఆర్థికవిషయకంగా చూసే ఎన్నో అవసరాలు-అలాంటప్పుడు ఆడవాళ్ళకి లైబ్రరీ అడిగి ధనవ్యయం చేయించకూడదు.

—కె. సరోజిని,

[విజయనగరం]

* * *

"తప్పెవరిది? చిక్కెక్కడ?" అనే వ్యాసములో ఆడబడుచులు, సవతి తల్లుల కష్టసుఖాలు కన్నుకు కట్టినట్లుగా విశదీకరించినారు. వారి వ్యాసం చదివినవారెవరు, ఆడబడుచులను, సవతి తల్లులను అసూయతో ఈర్ష్యతో చూడరని నమ్ముతున్నాను. వారికి నా ధన్యవాదాలు, 'ఆంధ్రపత్రిక' ద్వారా తెలియ జేయుచున్నాను.

స్వర్ణ నాయుడమ్మ చౌదరి,

కొండపాటూరు. ★

## ఇంటి శుభ్రత

(39-వ పేజీ తరువాయి)

ఇరకయిమందిలో సీత ఒక్కర్తి ఎంతకని తంటాలుపడగలదు? మనము ఓసారి సర్దినా అది మళ్లీ యథాప్రకారము పెట్టే ఓపిక వాళ్ళకు లేనప్పుడు ఏంచేస్తాం? ఇలాంటి వాళ్ళ ఇళ్ళల్లో తెరలూగిరలూ అనవసరం. "నీకీ అనవసర శ్రమఎందుకు?" అన్నా దాని గోడవంతా చెప్పకొచ్చాక.

మా ఇంటిప్రక్క ఒకరువున్నారు. భర్త బూజాలుదులిపితే భార్య గదులుకడుగుతుంది. ఆయన మొక్కలకు గొప్పలు తవ్వితే ఆవిడ నీరు తోడిపోస్తుంది. వాళ్ల త్తగారు వంటవండి పెడ్తుంది. ఆడబడుచులు, మరదులూ, తెరలు అవీ అల్లి, కుట్టిగుమ్మాలకు వేస్తారు. నిజంగా వాళ్లిల్లు భూలోక స్వర్గంలా వుంటుందంటే నమ్మండి. ఇంటికి వేళ్లే ప్రతి ఒక్కరూ ఎంతో ఆప్యాయంగా పల్కరించి మాట్లాడు తారు. ఇంట్లో వున్న ప్రతి ఒక్కరూ గృహాలంకరణకోసం పాటు పడ్తారు.

అంతేకాని "వదిన వేసిన తెరకదా! దాన్ని ఎలా మాపాలి?" అత్తయ్యకట్టిన రుమ్మాలు ఎల్లా-చింపాలి అని అనుకుంటుంటే ఎల్లాగ? వాళ్ళు ఈఇల్లు ఇంతవరకు శుభ్రంచేసి పెట్టారు. మనము ఎక్కడనుంచి తీసిన వస్తువును అక్కడనే పెట్టే సర్ది పెట్టేవాళ్లకు సులువుగావుంటుంది. సర్దేది సర్దుతూవుండగా పారేసేది పారేస్తూ వుంటారు. ఇంక అలాంటి ఇళ్ళను ఎంత దర్జాగా వుంచుదామన్నా వుంచలేము. మన ఇల్లు అందంగా, పొందికగా వుండాలీ అంటే—

ఇంట్లో వున్న ప్రతిఒక్కరు సాయపడాలి. అప్పుడే ఆ ఇల్లు కలకల లాడుతూ నందన వనంలా—నవ్వుల పంటలా వుంటుంది ★

## వంటలు

(38 వ పేజీ తరువాయి)

చాలా రుచిగా ఉంటాయి.

8. ఆనపకాయ ఊరగాయ :-పొయ్యి మీద ఒక "స్టెయిన్ లెస్ టీ"లు పాత్రలో 1 కప్పు నువ్వులనూనె పోసి బాగా కాగిన తరువాత ½ టీస్పూన్ (చెమ్చా) ఇంగువ; 1 టీస్పూను ఆవాలు ¼ టీస్పూను మెంతులు; కొంచెము కర్వేపాకు వేసివేయించి, లేత ఆనపకాయతొక్కుతీసి ముక్కలుగా తరిగి 2 కప్పులు ముక్కలువేసి 5 నిమిషములు, వేయించి, చారెడుకారం, 1 టీస్పూను పసుపు, 1 నిమ్మపండు రసము వేసి బాగా కలిపిదించి చల్లారిన తరువాత సీసాలో వేసుకోవాలి. 15 రోజులుపైగా నిలువవుంటుంది.

మామిడికాయ దొరకనిప్రదేశము మా ఒరిస్సాలోని సోదరీమణులము ఇదే వాడు తున్నాము.

దవళ ధర్మవతి, పూరీజగన్నాథ్. ★

## నా వేషాషీ

(36-వ పేజీ తరువాయి)

కొని, చిరిగినబట్టలతో, చింపిరితలతో వచ్చి అయోమయంగా పాపంతా పరికిస్తోంది పర్సు ఉద్యోగదుస్తులలో చాలా శుభ్రంగా, అందంగావుంది.

కన్నకూతుర్ని ప్రేమగా 'ఏటిబుల్లెమ్మ! ఇయ్యన్నీ' అని అడిగింది తల్లి కూతురు ప్రేమతో తెలియనివన్నీ విమర్శగా చెప్పి ఆమెకు కావలసినవి కొని ఇచ్చింది వద్దంటున్నా. ఆతల్లి అనుభవిస్తున్న సంతోషానికి అంతు లేదు. అటువంటిబిడ్డలకు ఎంతకష్టపడి చదువు చెప్పించినా ఉపయోగం వాళ్ళకువుంటుంది; చదువుకున్న వాళ్ళకూ వుంటుందిమరి. ఆతల్లీ, కూతుళ్లను చూస్తూ నేనూమురిసిపోయి, వచ్చిన పనికొంచెం ఆలస్యం చేశాను. కొందరికి ఎంత అవసరవసవులైనా చేత్తో పట్టుకెళ్ళడం నామోషీ! (సంచీలు, గొడుగులు) ముసలమ్మలు, అమ్మ, కూడావసే నాకూడా నాస్నేహితునిఇంటికి నీవెందుకు? అని కసురుతారు అన్నివిధాల పనికొచ్చినతల్లి, స్నేహితులతో సరిగామాట్లాడకపోతే తనకు పరువు నష్టమనీ, తలవంపులనీ భావిస్తారు కొందరు. ఇటువంటి రకాలుచూచే చదివించడం అంటే కొందరికి భయం, విరక్తిగల్గుతున్నాయి. నాగరికత, విద్య ఎక్కువ అవుతున్న రోజుల్లో పూర్వపు అనురాగ, అభిమానాలు మర్చిపోయి ప్రవర్తించడం సిగ్గుచేటని తెల్సుకోవాలిమరి. ★

## మహిళాభ్యుదయం

35 వ పేజీ తరువాయి

తోడ్పడే అవకాశం స్త్రీలకు లభిస్తూంది.

నైతికంగా భ్రష్టులైన పతితలను, సంస్కరణ గృహాలనుండి విడుదల అయి వచ్చిన స్త్రీలను, మంచి దారినపెట్టి జీవనోపాధి చూపి ఉద్ధరించే నిమిత్తం, కేంద్ర సంక్షేమసంస్థవారు రాష్ట్రీయ శరణాలయాలను, జిల్లాస్థాయి శరణాలయాలనూ నెలకొల్పబోతున్నది ఆంధ్ర ప్రదేశ్‌లో జిల్లాకొకటి చొప్పున 20 జిల్లా శరణాలయాలు, కర్నూలు, హైదరాబాద్, రాజమండ్రీ నగరాలలో రాష్ట్ర శరణాలయాలు నెలకొల్పవలసి ఉన్నది పతిత స్త్రీలను తాత్కాలికంగా జిల్లా శరణాలయాల్లో ఉంచి, అర్హులైనవారిని రాష్ట్ర శరణాలయాలకూ పంపి, వృత్తిపనులలో శిక్షణఇచ్చి వారిని స్వయం పోషకులుగా తయారు చేయడం వీటి ముఖ్యోద్దేశం రాజమండ్రీలో శ్రీ వీరేశలింగంపంతులు మహిళా సముద్ధరణాలయం ఈసంవత్సరమే నెలకొన్నది. మిగిలిన శరణాలయాలను కూడా ఈ సంవత్సరాంతం లోపల ప్రారంభిస్తారు. ★




# మూర్ఖులతో సంభాషణ



ఒక్క చెఱువుగట్టుమీద
పెక్కుకొంగ లుండె చేరి
ఆ సమయములో నింగిని
హంస యొకటి పోవుచుండె.

దాని జూచి కొంగలెల్ల
తమలో అచ్చెరువు నొందె:
ఆబకములలో నొక్కటి
హంస నిట్లు పల్కరించె.

కొంగ:
"ఎవడ వీవు? కాళ్లు మొగము
యెఱ్ఱనైన తమ్ముడూ!"

హంస:
"అవనియందు నన్నెల్లరు
హంసయందురన్నలూ!"

కొంగ:
"ఎచ్చట నివసింతువీవు?
మెఱుగ జెప్పు తమ్ముడూ!"

హంస:
"మానసమను సరోవరము
మాకు వాసమన్నలూ!"

కొంగ:
"వినిపింపుము అచటనున్న
వింత లేవో? తమ్ముడూ!"

హంస:
"కలవచ్చట కాంచనాబ్జ
ములు, ముత్తెము లన్నలూ!"

కొంగ:
"నత్తల శుభవార్తగూర్చి
యెత్తవేమి? తమ్ముడూ!"

హంస:
"నత్తలన్న నవి యేవో
నాకు తెలియదన్నలూ!"
అది విని యా బకములెల్ల
హాహాహాహాహాయనినవ్వెను:
ఆయవహేళనమునకై
హంస చిన్నబుచ్చుకొనెను.

మూర్ఖులకడ నొకొకప్పుడు
పుడమినెంతవారైనను
మెందుకు కొఱగాకుండుట
యిందుకొఱకె కాబోలును!



—ఆర్. దొరసామి.

# గణపతి భట్టు

**రెంటాల గోపాలకృష్ణ**

ఒక గ్రామంలో ఒక భట్రాజున్నాడు. అతనిపేరు గణపతి. గ్రామంలో ఎవరింట్లో పెళ్ళి జరిగినా, మరే శుభకార్యం జరిగినా గణపతిభట్టు హాజరవుతాడు. యజమానుల కీర్తిని పొగడుతాడు. పద్యాలు, పాటలు కట్టి చదువుతాడు. వారతని పొగడ్తలకు మెచ్చి బహుమతు లిస్తారు. వాటితో అతను పొట్ట పోసుకుంటున్నాడు. ఇది అతని కుల వృత్తి. తరతరాలనుంచీ వస్తున్న రివాజు.

గణపతిభట్టు చాలా తెలివైన వాడు. సమయస్ఫూర్తి, ప్రతిభ కల వాడు. మంచి కవి. ఆశుకవిత్వం అతని నోటివెంట ధారగా వెలువడుతుంది.

ఆ గ్రామంలోనే ఒక జమీందారున్నాడు. బాగా ఉన్నవాడు. అతని ఇంట్లో ఏచిన్న శుభకార్యం జరిగినా గణపతిభట్టు అక్కడికి వెళ్లేవాడు. జమీందారునుగురించి స్తోత్రపాఠాలు చెప్పేవాడు. ఆయన కీర్తిప్రతిష్ఠలు పొగడేవాడు. కాని జమీందారు కడులోభి. గణపతి భట్టుకు ఎప్పుడూ ఇనాము ఇచ్చేవాడుకాడు. ఎప్పటికప్పుడు ఏదో ఒక సాకుచెప్పి తెలివిగా తప్పించుకునేవాడు. గణపతిభట్టు స్తోత్రపాఠాలన్నీ చెప్పినతరువాత, అంతా విని ఆనందించి చివరకు "భట్టుమూర్తీ! మెచ్చాం నీ పొగడ్తలకు. నీవు నిజంగా కవిసమ్రాట్టువయ్యా. నీకు మంచి ఇనాం ఇవ్వదలుచుకున్నాం. కాని ఇప్పుడుకాదు. మళ్ళీ మా ఇంట్లో పెద్ద శుభకార్యం వస్తున్నది. అప్పుడు నిన్ను ఘనంగా సన్మానించి, సత్కరిస్తాం" అనేవాడు జమీందారు.

ఇలా అనేకతడవలు జరిగింది. అయినా గణపతిభట్టు జమీందారును వదిలిపెట్టలేదు. ఆయనపై కొండంత ఆశపెట్టుకుని ఎప్పుడో ఏదో ఒక ఇనాం ఇవ్వకపోతాడా అని కనిపెట్టుకుని ఉన్నాడు.

గణపతిభట్టుకు ఎన్నాళ్ళబట్టో ఒక ఆశ ఉన్నది. అతనికి ఇంట్లో పాడిలేదు. ఇంట్లో అందరూ పాలకూ, పెరుక్కూ మొహంవాచిపోతున్నారు. అంచాత జమీందారు నడిగి ఒక మంచి పాడిగేదెను ఇనాముగా పుచ్చుకోవాలనుకున్నాడు.

ఇంతలో జమీందారు ఇంట్లో పెళ్ళి వచ్చింది. ఆయన పెద్ద కుమారుడి పెళ్ళి అది. వివాహం రంగరంగవైభవంగా జరుగుతున్నది. ఆ గ్రామంలో వారేకాక, చుట్టుపక్కల ఊళ్ళనుంచికూడా అనేకమంది పెద్దలు పెళ్ళికి వచ్చారు. తన మామూలుప్రకారం గణపతిభట్టు హాజరైనాడు. తీర్చిదిద్దిఉన్న పెళ్ళి సభలో జమీందారు కీర్తిని గొప్పగా పొగిడాడు గణపతిభట్టు. వధూవరుల నాశీర్వదిస్తూ పద్యాలుకట్టి చదివాడు. సభవారంతా భట్రాజును మెచ్చుకున్నారు. కాని ఎప్పటికప్పుడు యజమాని తనకు ఇనాము ఇవ్వకుండా ఎగనామం పెడుతున్నాడన్న సంగతి గణపతిభట్టుకు బాగా తెలుసును. ఈ మాటు నోరుతెరిచి అడగాలనుకున్నాడు. స్తుతించడం అంతా అయిపోయాక తుదకు భట్రాజు ఇలా అన్నాడు :

"మహాప్రభో! మీ కీర్తిచంద్రికలు దశదిశలా వ్యాపిస్తున్నాయి. దానగుణంలో మీకు మీరేసాటి. నాకు ఇనాం ఇప్పించండి."

తీరా నోరుతెరిచి అడిగారు భట్టుమూర్తి. నిండుసభలో తన గౌరవం నిలుపుకోక తప్పిందికాదు జమీందారుకు.

"ఏం కావాలో కోరుకో." అన్నాడు జమీందారు.

"మహాప్రభో! ఒక పాడి గేదెను ఇప్పించండి" అన్నాడు భట్రాజు.

"అలాగే ఇస్తాం." అన్నాడు జమీందారు.

కాని జమీందారు అన్నమాట నిలుపుకోలేదు. భట్రాజుకు పాడి గేదె ఇవ్వలేదు. ఇలా ఒక ఏడాది గడిచింది. జమీందారుకు మనమడు పుట్టాడు. పిల్లవాడికి జాతకర్మ, నామకరణ మహోత్సవాదులు మహా వైభవంగా జరుపుతున్నాడు జమీందారు మళ్ళీ ఈ శుభకార్యానికి కూడా అనేకమంది పెద్దలు విచ్చేశారు. ఎక్కడెక్కడి పండితులు, విద్వాంసులు వచ్చారు. మళ్ళీ గణపతిభట్టుకూడా హాజరైనాడు. నిండు సభలో యజమాని కీర్తిని గొప్పగా పొగిడాడు. కావ్యాలు వినిపించాడు. జమీందారు వంశగౌరవాదులను వర్ణిస్తూ, పేరు పేరున పద్యాలుకట్టి చదివాడు. గణపతిభట్టు ప్రతిభకు సభవారంతా 'సెబాస్' అన్నారు పండితులు మెచ్చుకున్నారు. జమీందారు కూడా సంతోషించాడు. ఇహ ఇప్పుడైనా తనమాట నిలుపుకుని భట్రాజును సత్కరించకపోతే, తన పరువు పోతుందనుకున్నాడు. కాని ఆయన లోభిగుణం ఎక్కడికి పోతుంది? ఇనాం ఇవ్వడంలో తన లోభిగుణం కనపరిచాడు. తన సేవకుణ్ణి పిలిచి అతని చెవిలో "తక్కువ ధరకు ఒక ముసలిగేదెను విచారించి పట్టుకరమ్మ"ని చెప్పాడు.

సేవకుడు గేదెను పట్టుకొచ్చి సభలో నిలువోబెట్టాడు. దాన్ని చూసేసరికి గణపతిభట్టుకు మనస్సు చివుక్కుమన్నది. అది ముసలిగేదె. బాగా వడిలిపోయి, వట్టిపోయిన గేదె. ఆగేదె పాలూ ఇవ్వదు, కట్టాకట్టదు. ఇహ ఎందుకది? భట్రాజు ఆలోచనలో పడ్డాడు. అందరు పెద్దలున్న ఆ నిండుసభలో ఆగేదె పనికిమాలినదని, దాన్ని తాను స్వీకరించనని చెప్పడం బావుండదు. అలా చేస్తే పదిమందిలో యజమానిని అవమానించినట్టవుంది. పోని ఆగేదెను స్వీకరిద్దామా• అంటే అతనికి మనస్కరించడం లేదు. దానివల్ల ఏమిటి ఉపయోగం,? అది పాలూ ఇవ్వదు, కట్టాకట్టదు ఇహ ఎందుకది ? "ఈ తరుణంలో నేను మెదలకుండా ఊరుకుంటే జమీందారు నిజంగా గొప్ప దానశీలు డనుకుంటారు అంతా. ఆయన కీర్తి సంపాదించుకుంటాడు. మరి నాకు ఒరిగిపడేదేముంది?" అనుకున్నాడు గణపతిభట్టు తనలో.

అతని కొక చక్కని ఆలోచన తట్టింది. యజమాని లోభితనం బట్టబయలయ్యేటట్టున్న, అది తననోటిమీదగా చెప్పినట్టు కాకుండాను, ఒక చమత్కారమైన నాటకం ఆడాలనుకున్నాడు.

గణపతిభట్టు ఏమంటాడో విందామని సభవారంతా ఎదురు చూస్తున్నారు. కాని అతను ఏమీ అనలేదు. గేదె దగ్గరికి వెళ్ళాడు. దాన్ని ఏదో అడుగుతున్నట్టుగా దాని చెవి దగ్గర నోరు పెట్టాడు. తరువాత అది చెబుతున్నది తాను వింటున్నట్టుగా దాని మూతిదగ్గర తన చెవిపెట్టాడు.

సభవారంతా ఇదేమని నివ్వెరపోయి చూడసాగారు. జమీందారు కూడా ఆశ్చర్యచకితుడై "గణపతీ! ఏమిటయ్యా నీవు చేసేది?" అని అడిగాడు

గణపతి భట్టు సవినయంగా

# గణపతి భట్టు

చేతులు జోడించి నిలుచున్నాడు. భయభయంగా "ఏమీ లేదు మహాప్రభో! ఈ గేదెను ఒకమాట అడిగాను" అన్నాడు.

"ఆ అడిగిందేమిటో మాకు కూడా చెప్పవయ్యా" అన్నాడు జమీందారు.

"గేదెను 'నీవు ఈ నమోసి ఉన్నావా?' అని అడిగాను మహాప్రభో!" అన్నాడు భట్టు.

"మరి అందుకు అది ఏం సమాధానం చెప్పింది?" అని అడిగాడు జమీందారు కోపంతో.

"అది చెప్పిన సమాధానం శౌఫు తాను వినండి మహాప్రభో!" అంటూ గణపతి భట్టు ఒక పద్యం చదివాడు. తరువాత ఆ పద్యానికి అర్థం వివరిస్తూ ఇలా చెప్పాడు: "కృత యుగంలో నేను మహిషాసురుడనే రాక్షసుడికి భార్యగా ఉన్నాను. ఆదిశక్తి నాభర్తను హతమార్చింది. కాని నేనుమాత్రం చావలేదు. తరువాత బ్రహ్మ త్రేతాయుగం సృష్టించాడు కాలంమారింది. మనుష్యులు మారారు. పశుపక్ష్యాదులు మారాయి. కాని నేను మాత్రం మారలేదు. పూర్వపు దేహంతోనే ఉన్నాను రావణుడు పుట్టడం, కామాంధుడై సీతనుఅపహరించడం, తుదకు రాముడిచేతిలో చావడం నా కళ్ళారా చూచాను. పిమ్మట బ్రహ్మద్వాపరయుగంసృష్టించాడు. కంసుడి దుర్మార్గాలు, శ్రీ కృష్ణుడి లీలలు కనులారా కాంచాను. ఇహ నాకు ప్రపంచంమీద రోతపుట్టింది. విరక్తి కలిగింది. అన్నిటిమీద భ్రాంతి వదులుకున్నాను. ఇప్పుడు

నాలుగోయుగం. కలియుగంవచ్చింది. నేను అన్ని ఆశలూ వదులుకొని ముక్కు మూసుకుని కూచున్నాను. ఈ వయస్సులో ఇప్పుడు నేను కట్టి ఈనమోస్తానటయ్యా! ఆ మాట అడగడానికి నీకు సిగ్గులేదుటయ్యా!" అన్ని గేదె చెప్పినట్టు చెప్పాడు భట్రాజు.

ఇంత యుక్తిగా, ఇంత చమత్కారంగా ఆగేదె ఏస్థితిలోఉన్నదీ సభవారికీ, జమీందారుకూ కూడా ఎరుక పరిచాడు గణపతిభట్టు. ఇప్పుడందరికీ అసలు విషయం అవగతమైంది. భట్రాజు ప్రతిభకు, సమయస్ఫూర్తికి అంతా మెచ్చుకున్నారు. జమీందారుకు కూడా కోపం పోయి సంతోషం కలిగింది. తన లోభిగుణాన్ని వదిలిపెట్టి అప్పటికప్పుడే మనుష్యులను పంపి మరొక చక్కని మూడు సంవత్సరాల పాడిగేదెను తెప్పించాడు. గణపతిభట్టుకు ఇనాముగా ఇచ్చాడు. దాంతోపాటు మరికొంత ద్రవ్యంకూడా ఇచ్చి సత్కరించాడు.

భట్రాజు సంతోషించి "అన్నదాతా సుఖీభవ!" అని ఆశీర్వదిస్తూ వెళ్ళిపోయాడు. ★

# నటనవేః బ్రతుకోయి!

(12-వ పేజీ తరువాయి)

వీరరసాన్ని రసాభాస చేశావురా పిడుగా" అన్నాడు తీక్షణరావు.

"నువ్వు పిడుగులు పడినట్టు పాడేస్తుంటే, నాకు భయమేసిందిరా మరి" అవధాని తన్నుతాను సర్దుకున్నాడు.

"సంతోషించాంగాని రిహార్సల్సు యీ వేళకి అయిపోయినట్టేరా" అన్నాడు యాదగిరి.

"శ్రీదారిద్ర్య నాట్యమండలికి!" అంటూ అబద్ధంగాడు లోపలికి ప్రవేశించాడు.

అందరూ "జై!" అంటూ జయజయ ధ్వానాలు చేశారు. తరవాత అందరూ ఒకే సారి నిద్ర ముంచుకొస్తున్నట్టు ఒక్కొక్కళ్లే జారుకున్నారు.

"ఒరే అప్రాచ్యపు వెధవా! అబద్ధంగా! ఎక్కడ చచ్చావురా ఇంతవరకూ?" ప్రశ్నించాడు యాదగిరి

"సుమ్మంపక్కనే ఒక్క కునుకు తీసాలేరా"

"వల్లకాటిలోకి వెళ్ళవలసినది."

"పోతారా"

"అక్కడికేనా?"

"అవును"

"వెళ్ళి చావు"

"ఉదయమే లేచివస్తాను"

"పగటిదెయ్యమై వస్తావాయేం?"

అప్పటికే గడపదాటిన అబద్ధంగాడికి దెయ్యమన్నమాట వినబడగానే అవతల అలుముకున్న చీకటిలో వెయ్యిభూతాలుఎదురయి వస్తున్నట్టు ఒక్కసారే కొవ్వున "అయ్య బాబో" అని కేక పెట్టి ఏకదూకులో వెనక్కు ఎగిరివచ్చి మీనాక్షిని రెండుచేతులతోను పట్టేసుకున్నాడు. గడగడ వణుకుతున్న అబద్ధంగాడిపట్టునుంచి విడిపించుకోడానికి బ్రహ్మప్రళయమయింది మీనాక్షికి.

నిలబడలేక చతికిలబడిన అబద్ధంగాడు ఇంకా కంపించిపోతున్నాడు. ఒళ్ళు చల్లగా వుంది. క్రింద పడుకోబెట్టి పరదాగుడ్డతీసి కప్పాడు యాదగిరి.

"చచ్చిపోలేదుగదా వాడు" అవధాని అడిగాడు.

"నీకెందుకుగాని వెళ్ళరా"

"అయితే, రా మీనాక్షీ వెడదాం"

"ఏడిశావ్, మీనాక్షికి నాతో రిహార్సలు

#  నటనమే బ్రతుకోయి! 

ఉంది. నువ్వుపోయి రేపు పెందరాళే రా ఆ నటన చూచెదువు"

"ఏం మీనాక్షీ, నాది నిజమైన ప్రేమే! దాని సంగతేమిటి మరి?"

"నిజంగానా, మరి ఆయన ఏదో రిహార్సలు ఉన్నదంటున్నారుగా. మా అమ్మయినా నిద్రమత్తుమీద యిప్పుడేమి టాలోచించగలదు. ఏం చెప్పినా రేపేగా"

"సరే నువ్వు లేకపోతే నేంకి నే నొక్కణ్నే వెడతాను మీ అమ్మదగ్గరికి" అవధాని జందెం సవరించుకుంటూ నిష్క్రమించాడు.

"ఇంక మనం రిహార్సల్సు వేసుకుందాం"

"డైలాగ్సు చెప్పండి"

"ప్రియా! తాజ్‌మహలుకంటే దివ్యమయిన మీ హృదయసౌధంలో నాకు స్థానమివ్వరా? మీ యెదలో దాగగలిగిన యీ ప్రణయతపస్విని కన్నకలలు కరగి వెన్నెల సెలయేరులై యమునానదిలా పొంగి ప్రవహించుతాయి. నా ప్రేమ జగద్విఖ్యాతమౌతుంది. నా గాథ చరితార్థమవుతుంది."

యాదగిరి నటనతో సహితంగా డైలాగులు చెప్పాడు

మీనాక్షి తిరిగి వాటిని అతనికి అప్పగించుతుంది.

"ప్రియతమా! నా హృదయాన్ని నీ వక్షోభాగంలో కుదించి, నీ అధరాలకు నా పెదవులు సంధించి; నీ కళ్ళలో నా ప్రతిబింబం చూచుకుంటూ యుగయుగాలూ ఇలాగే ఉండిపోయేట్టు ఏ దూర్వాసుడయినా శిలలుగా శపించివేస్తే బాగుండును" అంటూ యాదగిరి అత్తరాలా నటించేశాడు. మీనాక్షి ప్రణయోన్మాదినిలా ఉండిపోయింది. యాదగిరిలో వున్న నటనాచితి చూచో లేక ప్రణయతృష్ణను చూచో.

అంతలోకే మీనాక్షి తల్లి రంగమ్మ రివ్వుమంటూ గడపదాటి వచ్చింది. ఏ లోకంలోనో వున్న యాదగిరి అక్కడ్నుంచి తోక ఝాడించాడు.

యాదగిరి అదృశ్యమయ్యాక అవధాని పెద్దగా నవ్వుతూ రంగమ్మ వేషం విప్పేశాడు. నిలువుచూపు పడిపోయిన మీనాక్షి ఆశ్చర్యపోయి చూసింది.

పరదాగుడ్డ క్రింద పడుకున్న అబద్ధంగాడు "నటనమే బ్రతుకోయి" అంటూ పాట సాగించాడు, అదిరిపాటుగా లేచి

ఇదంతా వెలుపలవుండి కనిపెట్టిచూస్తున్న యాదగిరి అచ్చం రంగమ్మగొంతుతో "ఒసే! మీనాక్షీ, ఎక్కడున్నావే?" అని అరిచాడు. మీనాక్షికి చెరివొకవైపునుంచున్న అవధాని అబద్ధం పెరటిగుమ్మంలోనుంచి వుడాయించారు

వాళ్ళ నిష్క్రమణానంతరం యాదగిరి వెనకపాటునే వెళ్ళి మీనాక్షి కళ్లుమూశాడు. అతడని ఆమెకు తెలుసు.

ఆడదాని మనసు చూరగొనడానికి మగాడు ఎంత విచిత్రంగా నటిస్తాడో అనుకుంటూ యాదగిరివైపు తిరిగి అతనిమీదికి వెన్నెల సెలయేరులాంటి మధుర మందహాసతరంగం ఒకటి విసిరింది మీనాక్షి. ★



# అక్కన్న మాదన్నల మహేశ్వరం

(21వ పేజీ తరువాయి)

ఎప్పటనుండేవో నిర్ధారణగా తెలియదు. బహుశః ఈ మిట్టమీద వుండి వుండవచ్చునని ఊహింపవచ్చు. ఈ మిట్టనుండియే గోలకొండకు పోవు దారి వున్నది దానికి ఇరువైపుల మైలురాళ్ళున్నవి. ఈ రాళ్లవద్ద గుఱ్ఱములు అంచెలుగా నుండేవనీ, అక్కన్న మాదన్నలు ఏకాయెకిని గోలకొండ పోవడానికి

వాటిని వాడుకొనేవారనీ, చెప్పువారు. ఈ రాళ్ళు ఇప్పు డచ్చటచ్చట పడివున్నవి. మొదటి రెండురాళ్లను చూశాను వాటిమీద కొంత తెలుగులో ఏదో వ్రాయబడివున్నది. కాని మాసిపోవడంవల్ల చదువులకు వీలులేకున్నది. రాళ్లన్నింటిని చేర్చి, ప్రతులు తీయించినటయితే, కొంత చారిత్రకవిషయము తెలియవచ్చును.

ఇవి ఇప్పుడు కనిపించుచున్న చిహ్నములు

అక్కన్న మాదన్నల మరణానంతరము శివ విష్ణు దేవాలయముల ఆవరణము 1500 సంఖ్య గల అరబ్బిసేనకు నివాసస్థలమైంది. మిటమీద ఇండ్లువుండేవి దేవాలయముల పై భాగము, కళ్యాణమంటపము, కచేరీలుగా ఉపయోగపడేవి. సైనికులు హైదరాబాదుకు వచ్చి, తమ వేతనములు తీసుకొనడం, ఇతర కార్యకలాపములు సాగించడం జరుగుతుండేవి

ఈ అరబ్బి సైన్యమునకు, రాగా రాగా, వనపర్తి సంస్థానపు రాజాగారి అల్లుడు "షాన్రివాహబ్" అనువారు కప్తాను అయినారు వనపర్తి సంస్థానములో రెష్ణకు ఒకతరము క్రిందటి వరకు ఆంగ్లేయ తురకపేర్లు ఉండేవి ఈ హాన్రీవాహెబును స్థానికులు "ఎండిబాబు" అని పిలిచేవారు. వీరి భార్య రమణమ్మగారు.

గోలకొండదుర్గ ప్రాధాన్యం తగ్గి హైదరాబాదు నగరమునకు వచ్చిపోవుట క్రమగా ఉండడంవల ఈ అరబ్బుసేన హైదరాబాదు సమీపముననున్న చంద్రాయణ గుట్టవద్దకు మార్పబడింది అచ్చట వీరికి బారకాసులు అధికారులకు బంగళాలు కట్టబడినవి ఈ ప్రాంతమునకు మరల "మైసరం" అనే పేరు పెగారు. అరబ్బులకు మేకలను, ఫలవృక్షములను పెంచుటయందు మిక్కిలి ప్రేమ. కనుక ఈ "మైసరము" లో అనేక తోటలు వేయబడి హైదరాబాదు నగరమునకు ఫలములు రవాణా అవుతున్నది అసలు మైసరము (మహేశ్వరము) పాడుబడి వున్నది

శ్రీ నరసింహశాస్త్రిగారితల్లి యౌవనము వరకూ మహేశ్వరములో అనేక బ్రాహ్మణ కుటుంబములుండేవి. వీరిపూర్వులు అక్కన్న మాదన్నగార్ల అన్నసత్రములో పనిచేస్తుండే వారు వీరుకాక, పప్పువారు, చల్లవారు, చేమకూరవారు, నేతివారు, ఉప్పునూరువారు, విస్తళ్ళవారు అను ఇంటిపేరుగల కుటుంబములుకూడ వుండేవి. ఈ పేర్లనుబట్టి వీరు ఏ పని చేస్తుండేవారో తెలిసికోవచ్చు. పులుసు వడ్డనకు హౌజులు కట్టబడినవట. భోజనమునకు పిలవడానికి జాగంట మ్రోగించేవారు. దానిని ఈమెకూడా చూచినది.

అక్కన్న, మాదన్న కాలములో అనేక మంది పండితులు వారినీ దర్శించి బహుమతులు పొందుతుండేవారు. పరీక్షకు నిలచువారు కూర్చుండు ఎత్తు స్థలమునకు "ఓపగడ్డ" అనే పేరుండేది. దేవాలయ పోషణకై 60 యకరముల మెట్టభూమి, 10 ఎకరముల మాగాణిభూమి వున్నది అరబ్బుసైనికుల కాలములో కప్తానుల స్వాధీనములోవుండి అవి వెళ్ళిపోయినతరువాత అమ్మి వేయబడినవి. ఇప్పుడవి 'గ్రామపు సర్పంచ్' అధీనములోనికి వచ్చినవి. అతడే శిస్తుకట్టి ఫలసాయమును అనుభవించుతున్నాడు. దేవాలయములను చూచువారు లేరు

ఆంధ్రులకు వందనీయులగు అక్కన్న మాదన్నల సరియైన చరిత్రను వ్రాయించడం చాలా అవసరం కుతుబుషాహీరాజుల వంశము చరిత్రకు అతీతమైనదికాదు. హైదరాబాదు స్టేటు గ్రంథాలయములో పారసీకములో అనేక గ్రంథములున్నవి. వాటిని పరీక్షించడం మహేశ్వరమునుండి, గోలకొండవరకు పడివున్న రాళ్ళప్రతుల తీయించుట చాల అవసరం. ఈ పనిని పురాతత్వవస్తు శాఖవారుచేసి, చారిత్రికులకు సౌలభ్యము కలిగించాలి.

ఇప్పుడు మహేశ్వరములోని దేవాలయములు, వాటి భూములు వ్యక్తిగతమైన ఆస్తిగానున్నవి. స్థానికులు చందాలు వసూలుచేసి వాటని పునరుద్ధరించడానికి కుతూహలులై వున్నారు. కాని, వారికి తగు ప్రభుత్వ సహాయము కావలసివున్నది. ★



#  మదరిండియా 

రంగులూ, సెట్టింగులూ మొదలైన హంగులు ఎక్కువగా ఉన్న చిత్రంలో కథ, కథనం అఖండంగా ఉండవన్నది కొందరికి కొండగుర్తు ఈ హంగుల భరోసా చూసుకొని, అసలు విషయాలగురించి అశ్రద్ధ చేయటం నేరమని ఈ చిత్రం నిరూపిస్తున్నది. కథ, కథనం రెండూ ఉత్తమమైన స్థాయిని అందుకొని నిలబడ్డాయి (చాలాసేపు)

జీవితం అంత నిజంగా, సహజంగా ఉన్న కథను దర్శకనిర్మాత మహబూబ్ ఇందులో చెప్పారు ఇది పదిహేనేళ్ళ క్రితం ఒకసారి చెప్పినదే ఈసారి టెక్నికలర్‌లో మళ్లీ చెప్పారు అప్పుడది చాలా బాగుందని పించుకుంది ఇప్పుడిది ఇంకా బాగుందని పించుకుంటుంది ఎందుకంటే ఇపుడు అందుబాటులో ఉన్న సాంకేతిక సదుపాయలన్నిటినీ మహబూబ్ సద్వినియోగం చేసుకున్నారు స్టార్ వ్యాల్యూకు కొటింపు శక్తిగల ముఖ్యనటి నర్గిస్ తన ప్రతిభ సంతటినీ ఇందులో చూపించింది ఛాయాగ్రహణ దర్శకుడు ఫరెదూన్ ఇరానీ తన చాకచక్యాన్ని, తన విద్యలో శిల్పాన్ని అనల్పంగా ప్రదర్శించారు అన్నివిధాలా అన్యాయం చేస్తున్న విధిని, శాయశక్తులా ఎదురుతిరిగిన జీవితాన్ని ధైర్యంగా ఎదిరించి, కష్టాలను ఓర్పుతో భరించి, వానలతో వరదలతో నిభాయించుకుని నెగ్గుకొచ్చిన రైతుస్త్రీ రాధ, బాధగాధను నటి నర్గిస్ మరువరానివిధంగా చెప్పింది చిత్రం ఆరంభంలో, ఆ 90 ఏళ్ళ ముసలిపట్ల గ్రామస్థులు చూపిన పూజ్యభావం, గౌరవం అతురాలా రాధ కష్టపడి సంపాదించుకున్నవే తప్ప, పి జి జోషి అమోఘంగా మేకప్ చేయడంగాని, ఇరానీ అద్భుతంగా ఫొటో తీయడంవల్ల గాని, పత్రికలలో వార్త పడుతుందన్న ఆశవల్లగాని కాదని నర్గిస్ నిరూపించింది ప్రేక్షకుడికి ఆవశ్యకం గౌరవభావం కలిగించింది

దర్శకుడు మహబూబ్ కథను తెరమీద చిత్రించిన విధం, అత్యంత మనోహరంగా ఉంది అత్తాకోడళ్ళ కథ, ఆలుమగల ప్రేమ కథ, తల్లి బిడ్డలను సాకి, పెంచిన కథ, తను పెద్దదై, తనపిల్లలు చేతుల్లో పెరిగిన కథ - ఇలా ఒక్కొక్క సన్నివేశం ఒక్కొక్క మనోహరమైన మరపురాని కథ ఆనందంలాటి సుఖ అన్నీ కలసి ఇంకో మంచికథ తల్లిగా రాధపడ్డ కష్టాల కథను చెబుతున్నపుడు మధ్యలో ఆమె సుఖంగా ఉన్న నాటి సంఘటనలను అతి నేర్పుగా చొప్పించాడు దర్శకుడు పెళ్ళిఅయిన కొత్తలో చూపు తను కొన్ని సన్నివేశాలను ఇంగుకోసం తాయిలంలా అట్టే పెట్టి ఉంచారు ఈ తాయిలం రుచి, గత జీవిత స్మృతుల మాధుర్యం ఎరిగినవారికి, కష్టపడుతున్నపుడు సుఖపడ్డ రోజులను గుర్తుకు తెచ్చుకుని సంతోషపడి, ఉత్సాహం ఆత్మవిశ్వాసం తెచ్చుకునేవారికి బాగా తెలుసుంది వీటిని వాడటంలోకూడా దర్శకుడు మెచ్చతగ్గ మితి, పొదుపు చూపాడు ఈ ఘట్టాలకు బరువుచే కూర్చినది ఛాయాగ్రహణం సంభాషణలు లేనిచోట్ల, వాటికి అందనిచోట్ల ఇదే వ్యాఖ్యానంగా భాసించింది ఒక మంచి వాక్యంగాని, ఒక పెద్ద కావ్యంగాని వర్ణించి చెప్పగల అందమైన దృశ్యాలను చూపించింది కొన్ని ఘట్టాలకు ఇరానీ చిత్రవ్యాఖ్య, నేపథ్య సంగీతంగా వినిపించింది కూడా అందుకే కొన్నిచోట్ల నౌషాద్ వాద్య సంగీతం వినిపించ లేదని పించింది

అలాగే అత్యంత మనోహరంగా ఉన్నవి, రాధ భర్త పాత్ర ధరించిన రాజ్ కుమార్ విగ్రహం, నటన అలాగే రాధ చిన్నకొడుకు చిన్నప్పటి వేషం వేసిన మాస్టర్ సాజిద్ ఈ ఎగ్రాడు చూట్టానికి ముద్దొస్తాడు పిల్లలందరూ అంతే ఎటొచ్చి సినిమాలలో పిల్లలు, దర్శకుల పుణ్యమా అని అట్టేసేపు మనోహరంగా ఉండరు - ముదర డైలాగులు అనవలసి రావడం మూలాన ఈ చిత్రం దర్శకుడు అలాటి పాపానికి ఒడిగట లేదు వాడి ఈడుకితగ్గట్టే ఆడించారు, ఏడిపించారు వాడి ఊహలనే అనువదించారు 'ఇల్లి మాడండి' అని మీరు మీ పక్కింటివాళ్ళకి చెప్పినపుడు, అందుకు ఇదో కారణం అవుతుంది

ఈ చిన్నకొడుకు పెంకెఘటం అంగుళే ఉండుండి ఇంటర్‌వెల్‌కి కొస్త అటూ



'మదరిండియా'లో నర్గిస్
రాజ్ కుమార్

సమాహార నృత్యాలు ఎన్నిటిలో చూడబోతున్నదీ వెండితెర చెప్పాలి

నిర్మాతలు, ఈ విజయం సాధించినందుకే కాక, సత్ఫలప్రదాయిని అనిపించుకున్న ఈ 'బాక్సాఫసూత్ర యజ్ఞం'లో తెరవేలుపులతోపాటు, సినిమాపాలిట ఇలవేలుపులవంటి టెక్నీషియన్‌లకు కూడా సమానగౌరవం ఇచ్చినందుకు ప్రత్యేకం అభినందనీయులు

'సువర్ణసుందరి' ధర్మమా అని, చలనచిత్ర పరిశ్రమల వ్యాపారదృష్ట్యా మరోక 'ఏ సెంటర్' దృగ్గోచరం అయిందని వ్యాపార విజ్ఞులు చెబుతున్నారు అదే నివురుగప్పిన నిప్పులా ఉన్న అమలాపురము. చిత్రం బాగుంటే, ఆ కేంద్రం ఎంత వ్యాపారం చేసిపెట్టగలదో ఈ చిత్రం ఋజువుచేసిందని అంటున్నారు

నిర్మాత, సంగీతదర్శకుడు అయిన శ్రీ ఆదినారాయణ ఈ చిత్రాన్ని త్వరలో హిందీలో నిర్మించబోతున్నారు

* * *

## రాజ్‌కపూర్‌కు సన్మానం

'జాగ్‌తే రహో' చిత్రనిర్మాత, ముఖ్యనటుడు—రాజ్ కపూర్ ను 'ఆంధ్రా హాలీవుడ్ "హెడ్ క్వార్టర్స్"' అయిన విజయవాడ నగరం అక్టోబరు 27 న ఘనంగా సన్మానించింది ఆ రోజు ఉదయం, నవయుగ ఫిలింస్ అధ్వర్యాన మారుతీ సినిమాలో పెద్దసభ జరిగింది దర్శకనిర్మాత ప్రసాద్, నటులు ఎన్ టి రామారావు ఎస్ వి రంగారావు, రంగస్థల నటుడు బందా కనకలింగేశ్వరరావు రాజ్ ప్రతిభను ప్రస్తుతించారు 'నవయుగ' అధిపతి కాట్రగడ్డ శ్రీనివాసరావు రాజ్ కపూర్ విజయం క్షానికి సర్వకారణమన్నారు నటుడు రామారావు ఒక అశోక స్తంభాన్ని, రజత నటరాజ ప్రతిమను రాజ్ కపూర్ కు ఇచ్చి గౌరవించారు కె వరసయ్య వందన సమర్పణ చేశారు

ఇంకోగంట తరవాత విజయా టాకీస్‌లో భారత రష్యాల సాంస్కృతిక సంఘం వారు మరో సభ జరిపి సన్మానించారు సాయంకాలం పురప్రముఖులు, చలనచిత్ర వణిక్ప్రముఖులూ విందు చేశారు విందుకు ముందు బహిరంగసభ జరిగింది అనంతరం విలేఖరుల గోష్ఠి జరిగింది

రాజ్ కపూర్ తనను సన్మానించినవారికి కృతజ్ఞత తెలుపుతూ, జెకోస్లొవాకియా ఉత్సవంలో 'జాగ్ తేరహో' చిత్రవిజయం (ప్రథమ బహుమతి) తనదీ తన సంస్థ (ఆర్



పొన్నలూరివారి రెండవచిత్రం
'శోభ'లో రాజసులోచన



మాస్కోలో జరిగిన అంతర్జాతీయ నృత్యప్రదర్శనాలలో తిరువాన్కూరు సోదరీమణులు పద్మిని, రాగిణి ప్రథమబహుమతి సంపాదించుకున్నారు. మద్రాసుకు తిరిగివచ్చిన అనంతరం, అక్టోబర్ 22-న దక్షిణభారత కళాకారులసంఘంవారు ఈ ఇద్దరికీ వాణీమహల్‌లో సన్మానంచేశారు. మద్రాసు విద్యామంత్రి శ్రీ సుబ్రహ్మణ్యం అధ్యక్షత వహించారు. శ్రీ ఎం ఎల్ శ్రీనివాసశెట్టియార్ తరఫున పట్టువస్త్రాలను బహూకరిస్తున్న రాజసులోచన, పుచ్చుకుంటున్న రాగిణిని ఈ చిత్రంలో చూడవచ్చు

...ఫిలింస్)ది మాత్రమే కాదనీ, ఇది దేశానిదీ, జాతీయ పరిశ్రమదీననీ అన్నారు. అర్ధరాత్రివేళ దాహంకొద్దీ మంచినీళ్లు తాగబోయిన ఒక పల్లెటూరి ఆసామి బస్తీ నాగరక జనారణ్యంలో నానా అవస్థపడడం ఇందులో కథ. త్వరలోనే 'జోకర్' అనే చిత్రం నిర్మించబోతున్నట్లు రాజ్ ప్రకటించారు.

## పారిస్‌లో చాప్లిన్

'అమెరికాపట్ల ద్వేషంతో నేను నా చిత్రం 'కింగ్ ఇన్ న్యూయార్క్' నిర్మించలేదు. ఒక దురాచారాన్ని విమర్శించడమే నా ఉద్దేశ్యం' అని చార్లీచాప్లిన్ ఇటీవల పారిస్ నగరంలో స్పష్టపరచారు.

చాప్లిన్ కొత్తచిత్రం 'ఎ కింగ్ ఇన్ న్యూయార్క్' అమెరికన్ జీవన విధానాలను హేళన చేస్తూన్నట్లున్నందువల్ల ఆ చిత్రం ఒకవిధంగా వివాదాస్పదం కావడం విదితమే.

అయితే తన లక్ష్యం కేవలం, ఒకరిపై ఒకరు పితూరీలు చెప్పుకునే దురాచారాన్ని ఖండించడమేననీ, దాన్ని వ్యాపించనిచ్చే ఏ దేశమైనా తన నాగరికతను, సంస్కారాన్ని తానే నాశనం చేసుకున్నదవుతుందని సాధ్యమైనంత సున్నితంగా సుతిమెత్తగా చెప్పడమేననీ చాప్లిన్ విశదపరచారు.

### ఆంక్ష

నా చిత్రంలో నేను చేసిన విమర్శను సరసత్వం, మంచిచెడ్డల తేడా తెలిసిన ఏ అమెరికన్ పౌరుడైనా ఆమోదిస్తాడని నాకు నమ్మకం ఉంది. అమెరికన్ ప్రజలు ఈ చిత్రాన్ని చూస్తే నేను చాలా సంతోషిస్తాను. ఇక ఈ చిత్రం వివాదాస్పదం అయిందీ అంటే మరేమీ ఫరవాలేదు. అసలు హాస్యమే అటువంటిది. అదెప్పుడూ వివాదాస్పదంగానే అవుతూవుంటుంది అని ఆయన అన్నారు.

### కాంక్ష

అమెరికామాట ఎలావున్నా, ఈ చిత్రానికి బ్రిటన్‌లోనే ప్రదర్శన సదుపాయాలు పుష్కలంగా లభించటంలేదట. చాప్లిన్ అమెరికాను విమర్శించాడన్న భావంతో, బ్రిటన్‌లోని 867 థియేటర్ల (మొత్తంలో ఐదోవంతు)పై ఆధిపత్యంగల మూడుసంస్థలు ఈ చిత్రాన్ని ప్రదర్శనకు తీసుకోవడానికి నిరాకరించాయని లండన్ పత్రిక 'ఈవెనింగ్ న్యూస్' ఫిలిం విమర్శకుడు జింప్సన్ హార్మన్ వెల్లడిచేశాడు.

"ఈ చిత్రాన్ని వీళ్ళు తీసుకోవడం హాలీవుడ్‌కు గిట్టదు. హాలీవుడ్‌కు కోపం తెప్పించడం వీళ్ళకి గిట్టదు. ఇదే కారణం. ఇది నా ఒక్కడిభావమే కాదు. బాధ్యత తెలిసిన ఫిలిం ప్రముఖులంతా ఈమాటే అంటున్నారు" అని హార్మన్ వ్రాశాడు.

## న్యూఢిల్లీ లేఖ

(5-వ పేజీ తరువాయి)

వాలనుకూడా అందించే ధోరణిలో ఉన్నాయని ఒక ప్రముఖ పత్రికారచయిత అభివర్ణించాడు.

ఒక వార్తాసంస్థ ప్రతినిధి అడిగిన ప్రశ్న ఇది:

"బొంబాయి కార్మికమంత్రి శ్రీ శాంతిలాల్ షా ఒకపత్రిక యజమానుల్లో ఒకరనీ, నిజానికి ఆయన దాని మేనేజింగ్ ట్రస్టీ కూడాననీ, అందుచేత కొంత ఘర్షణ జరుగుతోందనీ బొంబాయి జర్నలిస్టుల యూనియన్ ఆరోపణ చేసినట్లు మీకు తెలుసునా?

ఇంకొక పత్రికా రచయిత అడిగిన ప్రశ్న – "ఆర్థికమంత్రి శ్రీ టి టి కృష్ణమాచారి ఆర్థికవిధానాల్ని గూర్చి, విదేశాంగ విధానాల్ని గూర్చి చేసిన ప్రకటనలలో వైరుధ్యాలున్నందువల్ల మీ రాయన్ని బర్తరఫ్ చేస్తారా?"

ఈ ప్రశ్నల్ని బట్టి మంత్రులమీద ఆరోపణలు చేయడానికి, కేంద్రమంత్రుల్లో ఒకరిని బర్తరఫ్ చేయమని ప్రధానమంత్రిని ఒత్తిడి చేయడానికీ పత్రికా విలేఖరుల సమావేశాల్ని ఉపయోగించుకున్నట్లు విదితమవుతోంది.

పత్రికా విలేఖరుల గోష్ఠికి హాజరయ్యే విలేఖరులు ఫలాని మర్యాదలు పాటించాలని నిబంధనావళి ఒకటి ఉండడం అవసరం. ట్రేడ్ యూనియనిస్టులు అలాంటి నిబంధనావళిని రూపొందించలేదు గనుక, తీరిక ఉంటే సమాచార, బ్రాడ్‌కాస్టింగ్ శాఖ అయినా ఆ పని చేసిఉండేది. కాని పాపం ఆ శాఖకు బొత్తిగా తీరిక చిక్కడంలేదు. ఎంతసేపూ నాటకోత్సవాలు, నాట్యోత్సవాలు ఏర్పాటుచేయడంతోను, మాకక్కర్లేదు మొర్రో అంటున్న భారతీయులకు శాస్త్రీయ సంగీతం వినిపించడంతోనూ ఆ శాఖకు సరిపోతోంది. అంచేత ఒక పనిచేస్తే మంచిదనుకుంటాను. సమాచార, బ్రాడ్‌కాసింగ్ శాఖను రెండుగా విభజించి, సమాచార వ్యవహారాలను హోంశాఖకు అప్పగించడం బాగుంటుంది. లిన్‌లిత్‌గో తన మంత్రివర్గాన్ని విస్తృతం చెయ్యకముందు సమాచార వ్యవహారాలు హోంశాఖ అజమాయిషీకిందే ఉండేవి.

ప్రభుత్వ రహస్య రక్షణచట్టం గూర్చి ఏదో ప్రస్తావనరాగా, "ఈ చట్టం ప్రయోజనం తీరిపోయింది. ఇప్పుడు మనది జాతీయ ప్రభుత్వం" అని ఒక పత్రికా రచయిత వ్రాశాడు.

లార్డ్ కర్జన్ హయాములో ఈ చట్టం అమలులోకి వచ్చినది. ప్రభుత్వ రహస్యాలు బైటికి పొక్కకుండా చేయడానికి, వాటిని ప్రభుత్వ శత్రువులకు అందకుండా చేయడానికి దాన్ని ఉద్దేశించారు. ఇప్పుడు జాతీయ ప్రభుత్వం అధికారంలో ఉంది గనుక, ఈ ప్రభుత్వ రహస్యాలను కన్నాట్ ప్లేస్‌లో అమ్ముకోవచ్చునని అర్థమా? దేశంలోనూ, దేశం బయటా జాతీయ ప్రభుత్వానికి ఇక శత్రు

పులి లేరా! ప్రభుత్వ రహస్యాల ప్రస్తుత పరిస్థితి చూస్తే వీటిని తెలుసుకోగోరేవారికి అవి అతి సునాయాసంగా లభ్యమవుతున్నాయనే సంగతి వ్యక్తమవుతుంది. ఏ దేశంలోనూ ఇంత దారుణం ఉండదు.

ఈ చట్టంలోని బాగోగులలా ఉంచి, ప్రధానమంత్రి అప్పుడప్పుడు రాష్ట్ర ముఖ్యమంత్రులకు వ్రాసే ఉత్తరాలు ప్రచురితం కాకుండా చూడాల్సిన అవసరం ఎంతైనా ఉంది. వాటి ప్రచురణవల్ల ప్రధానమంత్రికి ఇప్పుడున్న అభిప్రాయ ప్రకటన స్వాతంత్ర్యం కాస్తా పోతుంది. ప్రచురణ అయిన కొన్ని ఉత్తరాలను బట్టి, ప్రధానమంత్రి సాధారణంగా జాతీయ, అంతర్జాతీయ పరిస్థితులను సమీక్ష చేస్తూ, భారతదేశానికి, ముఖ్యంగా ఆయా రాష్ట్రాలకు సంబంధించిన సమస్యలపై సలహాలిస్తూ ఉంటారని గ్రహించవచ్చు. ఒక ఉత్తరంలో ప్రధానమంత్రి మద్యనిషేధం అమలు కార్యక్రమాన్ని కొంచెం ఆలస్యం చేయవలసిందని, తద్వారా అభివృద్ధి కార్యక్రమాలకు కావలసిన డబ్బు కూడబెట్టవలసిందని, ముఖ్యమంత్రులకు సలహా ఇచ్చారట.

సలహా ఎలాగో బయటపడింది. వెంటనే మద్యనిషేధవాదులు తమ ఆందోళన తీవ్రతరం చేశారు. దీంతో ఒక మంచిపని నాశనమైనట్లయింది. ఇటీవల ఇలాగే మరొక విషయం బయటపడి నాగప్రాంతంలోని క్రైస్తవ మిషనరీలపని ఇరకాటంలో పడింది.

పత్రికా విలేఖరుల గోష్ఠిలో చెప్పినట్లు, మంత్రుల పర్యటన కార్యక్రమంకూడా రహస్యంగానే పరిగణించబడుతుంది. అందుచేత భారతదేశభద్రతకు, ప్రభుత్వ భద్రతకు సంబంధించిన రహస్య పత్రాలకు కూడా రహస్య రక్షణచట్టాన్ని వర్తింపజెయ్యాలి.

రహస్యపత్రం అని తెలిసికూడా దాన్ని ప్రచురించిన పత్రికా విలేఖరిని శిక్షించినప్పుడు, విలేఖరులను మచ్చిక చేసుకునే ఉద్దేశంతో వారికి రహస్యపత్రాలను అందజేసే వ్యక్తులను ఇంకా తీవ్రంగా శిక్షించాలి. ముఖ్యమంత్రులకు ప్రధానమంత్రి వ్రాసే ఉత్తరాలను ప్రతిమంత్రికీ, ఉపమంత్రికీ సహాయమంత్రికీ కూడా పంపిస్తారు. మంత్రిమండలికి సంబంధించిన పత్రాలను పార్లమెంటరీ వ్యవహారాల మంత్రికికూడా చూపిస్తారు. అందుచేత రహస్య సమాచారాన్ని బైటపెట్టే అలవాటున్న మంత్రిని బర్తరఫ్ చెయ్యటం ప్రధాని కనీసపు కర్తవ్యం. ఇలాంటి అలవాటున్న మంత్రుల్ని కొందర్ని ప్రధాని ఆమధ్య కొత్తగా మంత్రిమండలిని ఏర్పాటు చేసుకునే సందర్భంలో వదిలిపెట్టేసి కొత్తమంత్రులను వేసుకున్నారు కూడాను. రహస్య రక్షణకోసం గాను ప్రధానమంత్రి ఇంకా తరుచుగా ఈ చేస్తే మంచిది.

 

# ఆంధ్రప్రదేశ్ ప్రధాన న్యాయస్థానం



(32 వ పేజీ తరువాయి)

చింది. న్యాయమూర్తులు మిగిలిన హైకోర్టుల కంటె ఎక్కువకాలం పనిచేస్తారు; మిగిలిన వాటికంటే తక్కువకాలం వ్యర్థంచేస్తారు. న్యాయవాదుల సహకారంతో చురుకుగా పని చేస్తారు. ఐనా-వేలకొలది కేసులు నానుడుపడిపోతున్నాయి అంటే దానికి కారణం వేరేఉంది.

1956 వ సంవత్సరంలో అలహాబాదు హైకోర్టులో 26 గురు న్యాయమూర్తులున్నారు. బొంబాయిలో న్యాయమూర్తుల సంఖ్య 17. మనది ఉత్తరప్రదేశ్ తరువాత పెద్దరాష్ట్రాలలో ఒకటి. కోస్తా ఆంధ్రులు కోర్టు లావాదేవీలకు ఖ్యాతిగాంచారు. (క్షమించాలి! ఆంధ్రప్రాంతంలో 'న్యాయాన్వేషకులు' అధికసంఖ్యలో ఉన్నారని ఉద్దేశ్యం.) మదరాసు హైకోర్టులోని కేసులలో దాదాపుసగం ఆంధ్రకువచ్చాయి కాని ఆంధ్ర హైకోర్టు ప్రధానన్యాయమూర్తితో కలిసి ముగురు న్యాయమూర్తులతో ప్రారంభమైంది.

ప్రధాన న్యాయమూర్తి కోకా సుబ్బారావు, న్యా॥ పి. చంద్రారెడ్డి, శ్రీ ఉమామహేశ్వరం మన మొదట వచ్చిన హైకోర్టు జడ్జీలు. ముగురే న్యాయమూర్తులు కావడం వల్ల, కేసులు పేరుకొనిపోవడం ఆనాడే ప్రారంభమయింది. వెంటనే న్యాయమూర్తుల సంఖ్య హెచ్చించవలసింది. 1954 నవంబరు 1 వ తేదీన మరి ఇద్దరు న్యాయమూర్తులు-కె. భీమశంకరం, పి సత్యనారాయణరాజు - నియమించబడ్డారు. మరొక న్యాయమూర్తి-ఎస్. డి. కృష్ణారావు-1955 ఫిబ్రవరి 1 వ తేదీన ప్రమాణస్వీకారం చేశారు.

ఈనాటికి-నవంబరు 1, 1957-సరిగ్గా ఒక సంవత్సరంక్రితం ఆంధ్రప్రదేశ్ హైకోర్టు హైదరాబాదులో పనిచేయడం ప్రారంభించింది. హైదరాబాదు హైకోరులో పని చేసిన మరి ఐదుగురు న్యాయమూర్తులు- రాయి మనోహర ప్రసాద్, సయ్యద్ ఖమర్ హసన్, మహ్మద్ అహ్మద్ అన్సారీ, ఎ. శ్రీనివాసాచారి, పి జగన్మోహన్ రెడ్డి- ఆనాడు ఆంధ్రప్రదేశ్ న్యాయమూర్తులుగా ప్రమాణం స్వీకరించారు. నవంబరు 19 వ తేదీన నాంపలి కుమరయ్య మొదట అదనపు న్యాయమూర్తిగా, తర్వాత శాశ్వత న్యాయమూర్తిగా నియుక్తులయ్యారు.

## కేసులు నానుడు పడేవికావు

మనకు పదిహేనుగురు న్యాయమూర్తులైనా కావాలి. ఆంధ్ర హైకోర్టు ఏర్పడిననాడే అవసరమున్నంతమంది న్యాయమూర్తులు నియమితులైతే, కేసులు ఈ విధంగా నానుడు పడేవికావు కోరగా, కోరగా పదకొండు మాసాలకు ఆంధ్రప్రదేశ్ హైకోర్టుకు మరి ఇద్దరు న్యాయమూర్తులు నియమించబడ్డారు. ఈ అక్టోబరు 10 వ తేదీన శ్రీ పి. బసిరెడ్డి శాశ్వత న్యాయమూర్తిగాను, శ్రీ ఎ. రంగనాథం చెట్టి అదనపు న్యాయమూర్తిగాను ప్రమాణం స్వీకరించారు వీరిద్దరి నియామకం ఎంత ఆలస్యం అయిందంటే, త్వరలోనే మరి ఒకరిద్దరు న్యాయమూర్తులను నియమిస్తేగాని మన హైకోర్టులో పని తెమలదు.

ప్రధాన న్యాయస్థానంలో న్యాయమూర్తి పదవి చాలా బాధ్యతలతో కూడుకొన్న పదవి న్యాయనిర్ణయ మాలస్యమయితే న్యాయం జరగనట్టే అని లోకోక్తి (Justice delayed is Justice denied) అయినా సత్వర పరిష్కారానికి సాకల్య విచారణను త్యాగం చేయకూడదు. సాకల్య విచారణ తరువాత న్యాయమూర్తులు నిర్వచించే న్యాయసూత్రాలు తరతరాల న్యాయ పరిపాలనకు శృంఖలాలు తగిలించే అవకాశం ఉన్నది. భావిలో తమ నిర్ణయాల పరిణామాలను కూడా దృష్టిలో ఉంచుకొని న్యాయమూర్తులు తీర్పులు చెబుతారు.

తీర్పులు తొందరగా చెప్పడం ఎంత అవశ్యమో, అంత తొందరగా అమలు జరపడం కూడా అంతే అవశ్యం. న్యాయమూర్తి తీర్పు చెప్పినప్పుడు, ఆయన క్రింద పనిచేసే, షారుహేండు రైటరు రాసుకొని, టైపు చేసిన తరువాత న్యాయమూర్తి దానిపై సంతకం పెడతారు. ఆ సంతకంతో వాది ప్రతివాదుల మధ్య ఒక సమస్య పరిష్కరించబడిందని భావించవచ్చు. తీర్పుకు సంబంధించిన రికార్డంతా బెంచిగుమాస్తాల సెక్షనుకు పోతాయి. అక్కడనుంచి ఏ వివరాలు ఎక్కడెక్కడకుపంపాలో అక్కడికి ఆ వివరాలు బెంచిగుమాస్తాలు పంపిస్తారు.

గజేంద్రుడు ఆ పరమాత్మ ముందు 'రిట్' దరఖాస్తు దాఖలుచేస్తే పరమాత్మ-సిరికి చెప్పకుండానే, శంఖుచక్రయుగమున్ చేదోయి సంధింపకుండానే-పరువు పరువునవచ్చాడు సత్వరపరిష్కారం ఆ పద్ధతిలో మానవమాత్రు లెవరికీ సాధ్యంకాదు. సాధన సంపత్తి అంతా చేకూరిస్తే, మన న్యాయమూర్తు లెవ్వరూ సత్వర కార్యనిర్వహణంలో ఎవరికీ తీసిపోరు. న్యాయమూర్తి ఎ ఎస్. పి అయ్యర్ మన ప్రధాన న్యాయస్థానాన్ని గురించి ఇటీవలనే అన్న రెండు వాక్యాలు అవధరించండి

'పులిలాగ ఉండే మదరాసు హైకోర్టు, ఆంధ్ర విడిపోయిన తర్వాత పిల్లిలా అయిపోయింది. పిల్లిలా ప్రారంభించిన ఆంధ్ర హైకోర్టు పులిలా తయారయింది. మదరాసును మించిపోయింది'

ఒక ఆంధ్రేతరుడు మన ప్రధాన న్యాయస్థానానికి అర్పించిన నివాళి అది. దానికి మన మేమి చేర్చగలం?

★

## [illegible] మార్చ్ [illegible]

(7-వ పేజీ తరువాయి)

"ఏవమోయ్? నాటకాలాడబోక మా కాడ కిందటేన్నెల నన్ను 'దీవించి' బొమ్మ యించడానికి తాంబూలం పుచ్చుకొన్నప్పుడు ఏం చెప్పావు. అన్నాళ్లదాకా, ఇంకెవళ్లీ దీవించి కొంపదీసను రానివ్వను అని ఒట్టెయ్యలే? ఇపుడు మళ్ళీ ఇదేం కథ?"—

అని ఒకాయన అనబోయాడు

అలాంటి దేదో జరుగుతుందని కొలంబస్‌కు తెలుసు. తక్షణమే రాజా అతని కంటికి కనబడ్డాడు. కనబడగానే జ్ఞాపకం వచ్చింది కూడా.

"హల్లో బ్రదర్, ఎప్పుడొచ్చావ్? రా. కూర్చో అలా నిలబడిపోయావేం?... కమాన్..." అన్నాడు రాజాతో అర్జెంటు రాజకార్య మున్నట్టు.

రాజా తుళ్ళిపడి, మేలుకుని, ఈ హఠాత్సన్మానానికి ఆశ్చర్యపడి లేచి, 'యస్సార్ అయామ్ సడియో సార్......యువార్ బాక్స్ యండు మైబాగ్ సార్...... యవర్ అయామ్ బీటింగ్..." అంటూ సాధ్యమైనంత లేటతెల్లంగా, సుళువైన టెలిగ్రామ్య భాషలో తన భావాలను బట్వాడా చేయడానికి ఉపక్రమించాడు.

"ఫస్ కం అండ్ ఛెయిర్ డౌన్ ఇన్ ది సిట్ 'అన్నాడు కొలంబస్ నవ్వుతూ.

తక్షణం సభికులు లేచి, నిరక్షరంగా ముక్కు పుటా లెగరేసి, వెళ్ళిపోయారు.

రాజొక కుర్చీలో కూలబడి తన కథ చెప్పాడు తెలుగులో. (ఇంకా ఉంది)



Printed and Published for Nageswara Rao Estates (Private) Ltd, by S Radha Krishna at The Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty Street, Madras-1. Editor S. Sambhu Prasad



వృద్ధాప్యం, శైశవం

ఫొటో: వి కేశవశర్మ.

Regd. No. M. 4479.
Andhra Patrika Illustrated Weekly

# పాండ్స్ వ్యానిషింగ్ క్రీమ్‌ను వాడే

# ఆమె వెంట కనపడుటకు అతను గర్వపడతాడు

